మహామంత్రి తిమ్మరుసు

అల్లాదేవి

(పరుచూరి నారాయణాచార్యులు)

వెల : రు.10 - 00

డి.టి.పి.

అక్షరమాల

విజయవాడ



ప్రచురణ కర్త :

యోగప్రభా పబ్లికేషన్స్

ప్రకాశం రోడ్.

తిరుపతి

# ముందుమాట

చంద్రగిరి దుర్గాన విరిసిన మేధా సుమం సాళువ తిమ్మరాజు కాలగతికి చెక్కు చెదరక నిలిచిన గిరిదుర్గం లాంటి వ్యక్తిత్వం. స్వార్థానికి అతీతమయినది. పరార్థానికి విహితమయినది. మానవ సమాజవికాసంలోని పరమార్థాలను పల్లవించి, అభ్యుదయాలను ప్రభవించిన మూర్తిత్వం మహామంత్రి తిమ్మరుసు వారిది.

తుళు - సాళువ వంశాల ఒరిపిడుల ఒరవడులలో స్వార్థానికి అతీతంగా నలుగురు మహారాజులకు తన చేతుల మీదుగా పట్టాభిషేకం చేయించాడు

స్వయంగా సర్వం సహా సైన్యాధ్యక్ష పదవిని నిర్వహించి సంకుల సమరాలలోంచి తుళ వంశ అభ్యుదయాన్ని సాధించాడు. తన వారయిన సాళువుల ఒత్తిడి మీద కూడ తలవంచటానికి ఇష్టపడక సింహాసనాధిపత్యాన్ని తృణీకరించాడు. విశ్వవిజేత కావడం కన్నా విశ్వాసంగా జీవించడమే మిన్న అని భావించాడు. అందుకే అతడు అహరహము ఆంధ్రులకు స్మరణీయుడయినవాడు.

అర్ధ శతాబ్దం పాటు ఆంధ్రుల ఆధిపత్యాన్ని విహార వీధుల్లో కీర్తి కేతనంగా నిలిపాడు. ఉమ్మత్తూరు ఉడయర్ల నుండి ఉత్కళం గజపతులదాకా మూడు సముద్రాల మధ్య మహాసామ్రాజ్యం సంస్థాపనలో అతని పాత్ర అనన్య సామాన్యం. అనితర సాధ్యం.

ఇదంతా అతడు రక్తపాతంతో కాదు. మేధాసంపత్తితో సాధించాడు.

చిక్కు సమస్యలతో చెరలాడి, ప్రమాదాలను తృటిలో తప్పించి, అసూయకీలల్ని ఆలోచనలతో చప్పగా చల్లార్చి, బుసలు కొట్టే కాలనాగుల్ని పట్టి, ఆడించి, ఓడించాడు.

అదంతా తన ప్రభువుకు, ఆంధ్ర ప్రజలకే అంకితం చేశాడు. అందుకే ఆయన అన్ని కాలాలకు, ఆంధ్రులందరికీ,

అప్పాజీ !!

అతని చరిత్ర అందరికీ ఆదర్శం !

ఆంధ్రుల చరిత్ర ఒక మహాద్భుత కథా సరిత్సాగరం!

అందులో అప్పాజీ వ్యక్తిత్వం ఒక ఆణిముత్యం.

ఇట్లు,

బుధజన విధేయుడు

లల్లాదేవి

# మహామంత్రి తిమ్మరుసు

## నాంది

### పద్యము

**॥శ్రీ పంపా సరిదంచి దోదకములే శ్రీకంఠుపాదార్చకై**
**తాపంబొందుచు బర్వులెత్తు భువి: నా తాపారిశంభారివై**
**రూపాక్షేంద్రుని రుద్రవైభవము కారుణ్యంబు గాంభీర్యమై**
**కాపాడం గల వట్టి పాదములు మీ కామ్యంబులీ డేర్చుతన్॥**

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించును.)

## ప్రస్తావన

సూత్ర : సభ్య మహాజనులు, రసజ్ఞులు, విజ్ఞులు అగు పారిషదులందరికీ నమస్కారము (వెనుకకు తిరిగి) నటీమణీ ! నీవు కూడ రారమ్ము! త్వరగా రమ్ము.

(నటి ప్రవేశించును)

నటి: వచ్చుట ఎక్కడ ? నేనిక్కడనేయున్నాను కదా!!

సూత్ర : (ప్రక్కకు తిరిగి చూచి) ఓహో ఈవైపున నిలచితివా ! రసము నాస్వాదింప నేర్చిన పెద్దలందరు విచ్చేసియున్నారు. నమస్కరింపుము.

నటి : నమస్కరించుట మాత్రమేమి ? విజ్ఞులయిన పెద్దల పాద ధూళి శిరసున దాల్చవలయునని నా భావము.

సూత్ర : అట్లే ! నీ వినయము వివేకశీలుర అనుగ్రహమునకు పాత్రమగు గాక !

నటి : నటశేఖరా ! మనము ప్రదర్శించు నాటకము పేరును ప్రకటింపుము.

సూత్ర : మహామంత్రి తిమ్మరుసు అను చారిత్రక నాటకము.

నటి : చాల సంతోషము. వస్తు పరిచయము చేయుము ఆర్యా !

సూత్ర: అటులనే ! అఖండ ప్రజ్ఞాశాలి, రాజభక్తుడు, సమయజ్ఞుడు అయిన మన కధానాయకుని యదార్థ నామము సాళువ తిమ్మరాజు.

తండ్రిపేరు సాళువ రాచిరాజు. పండిత కుటుంబము. కౌండిన్యస గోత్ర సంభవుడు అయిన వేమరాజు ఈతని తాతగారు. తాత కొండవీడు దుర్గము, తండ్రి చంద్రగిరి దుర్గములలో నుద్యోగులయిరి. ఈయన పుట్టి పెరిగినది చంద్రగిరి. జీవించినది విద్యానగరము. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానములో మహామంత్రి పదవి మాత్రమే కాక, మహాసైన్యాధ్యక్ష పదవిని కూడ నిర్వహించినాడు.

ఇంచుమించుగా ఒక అర్ధ శతాబ్ద కాలము ఆయన పేరు స్మరించని దక్షిణాపథ చరిత్రయే లేదు సుమా !

ఆయన చేతులమీదుగా విజయనగర మహాసామ్రాజ్యంలో నలుగురు మహారాజులను పట్టాభిషిక్తులను చేసెను. అనాడు దక్షిణాది చిన్న చిన్న రాజ్యాలుగా, ముక్కలు చెక్కలుగా ఉండేది. అందరిని యుద్ధభయాలు వెంటాడుతుండేవి. అట్టి సమయంలో విద్యానగర మహాసామ్రాజ్యం స్థాపించి భయం తొలగించి ఆంధ్రులకు, కన్నడిగులకు అభిమాన పాత్రుడయ్యెను తిమ్మరుసు మహామంత్రి. అందుకే అందరూ ఆయనను అప్పాజీ (నాన్నగారు) అని ఎంతో ఆప్యాయంగా పిలుచుకునేవారు.

ఆయన చాల తెలివి కలిగిన మంత్రి. ముందు చూపుతో ఎన్నో చిక్కులను పరిష్కరించి విజయం చేకూర్చెను. అంతే కాక ఆయన గొప్పపండితుడు. సంస్కృతాంధ్రాలలో గొప్ప కావ్యాల రచనకు కారకుడయ్యాడు. దండనాయక పదవి నిర్వహించి కత్తి పట్టి యుద్ధం చేసిన మహావీరాగ్రేసరుడు. రాజభక్తి, చిత్తశుద్ధి ఈయన ప్రత్యేకతలు. తెలుగు ప్రజలు ఆప్యాయంగా, అభిమానంగా, సగర్వంగా స్మరించుకునే మహామూర్తులలో ఆయన అగ్రగణ్యుడని చెప్పుకోవాలి.

మహామంత్రి తిమ్మరుసు చరిత్ర స్మరించటమంటే ఆంధ్రులు స్వీయగాథను మననం చేయటమే !

అటువంటి మహనీయుని చరిత్ర కాబట్టి ఆలస్యమెందుకు? త్వరగా ప్రారంభించాలి ఆర్యా !

త్వరపడకు నటీమణీ ! పేరు వినగానే ఉవ్విళ్ళూరుతున్నావు. నాటకం రక్తి కట్టాలంటే రసజ్ఞులయిన ప్రేక్షకులు కావాలి. అలాగే నటించేవారు ప్రతిభావంతులు అయి ఉండాలి. వీరు ఇరువురితో పాటు ఈ నాటకాన్ని

రచించిన కవి పేరు అడుగవేమి ?

నటి : అవునవును. మరచాను. ఈ రచయిత పేరేమి ?

సూత్ర అనేక చారిత్రక రచనలు చేసి ఎంతో గొప్పపేరు గడించిన ఈ రచయిత నామధేయం పరుచూరు నారాయణాచార్యులు. వారి కలంపేరు "లల్లాదేవి. వారు నూరుకుపైగా నవలలు, ధారావాహికాలు రచించారు. శతాధికంగా కథలు, రేడియో ప్రసంగాలు, రేడియో నాటికలు, సినిమాలు రచించారు. తెలుగు కన్నడ భాషలలో ప్రసిద్ధి పొందారు. సంస్కృతం, ఆంధ్రం, ఆంగ్లం, హిందీ భాషలలో పాండిత్యం కలిగినవారు. పురాణ ప్రవచనం కూడ చక్కగా చేస్తారు. ప్రస్తుతం దేవాదాయ ధర్మాదాయ శాఖలో ఆస్థాన పౌరాణికునిగా పని చేస్తున్నారు. చారిత్రిక రచనలు చేసే ఈ రచయిత రచించిన నాటకం చూడవా మరి !

నటి : నాకోసం కాదు కదా ఆర్యా!
ప్రేక్షకుల ఉత్కంఠని మనం గమనించాలి.

సూత్ర : అందునా చారిత్రక నాటకం.
(ప్రేక్షకుల వైపు తిరిగి)
అందరికి నమోవాకాలు !
(నటివైపు తిరిగి)
అదిగో! ఆ వినిపించే కంఠస్వరమే తిమ్మరుసుది. నాటకం ప్రారంభమవుతున్నది.
ఇక వెడదాం పద.
(ఇద్దరూ నిష్క్రమించెదరు)

**ఇది ప్రస్తావన**

# ప్రథమాంకము

## మొదటి రంగము

(చంద్రగిరి. ప్రాతఃకాలము. గురుకులము. సాళువ తిమ్మరాజు బాలుడు. ప్రార్థన చేయును)

### పద్యము

**॥శ్వేతమయూఖ రేఖలను సేచక వీధులు జీల్చుకొంచు నీ
యా తపమిచ్చి జీవులకు నాయువు పోయుదు వోయి భాస్కరా !
కాతరమింత లేక మనగా గ్రహరాజుల నేలు కొంచు; నా
చేతన ముల్లసిల్ల నిను చేరి భజించెద నంజలించెదన్॥**

తిమ్మరుసు : కర్మసాక్షీ ! సూర్యదేవా ! గ్రహగతులను నియమించు గ్రహరాజువు నీవు. మేము తల్లిదండ్రులు లేని అనాధులము. వారు అకాలమున దేవుని దగ్గరకు వెళ్ళిపోయినారు. శ్రీనివాసుడు, శ్రీ అలమేలుమంగా పద్మావతీ దైవముల సంకల్పము అట్లున్నది. మాకు ఎవరును లేరు. నా తమ్ముడు సాళువ గోవిందరాజు, నా చెల్లెలు కృష్ణాంబలు ఇంకా పసివారు. పదునాలుగు సంవత్సరముల ప్రాయములో ఒక వంక గురువుల నొద్ద చదువు కొనుచూ, మరొక వంక తమ్ముని, చెల్లిని పోషించు కొనుచున్నాను. మధుకరము చేసినను దినము గడచుట లేదు. విస్తళ్ళు కుట్టి జీవించుదమన్నచో పెట్టుబడి ఖర్చయిపోయినది. ఇంకేమి దారి ? ఇట్టిస్థితిలో శ్రీనివాసుని దర్శనము చేయవలయునని తిరుమలకు పాదచారినై వెళ్ళుచుండగా ఒక వింత ఘటన జరిగినది. వేళకు భోజనము,నిద్రలేక పోయినందున నారాయణవనము చేరుసరికే నేను అలసి పోయితిని. ఒక బండరాయిపై పరుండి ఆదమరచి నిద్రించితిని. మెలకువ వచ్చి చూచునప్పటికొక యోగి నన్ను పరిశీలించుచు కన్పించినాడు. కారణము అడిగితిని. నేను నిద్రించుచుండగా నొక కృష్ణ సర్పము నా తలపై పడగ విప్పి యాడినదట. నేను ఆచంద్రతారార్కమగు కీర్తి సంపాదింతునన్నాడు. ప్రభుత్వములో మహాపదవులు నిర్వహింతునని జోస్యము చెప్పినాడు. పుట్టు పూర్వోత్తరములు అడుగగా చంద్రగిరిలో మధుకరము చేయుచు చదువు కొనుచున్నానని చెప్పితిని. సాళువ రాచిరాజు

కుమారులలో పెద్దవాడనని తెలుపుకొంటిని. ఆశీర్వదించి భవిష్యత్తు మీద ఆశలు కల్పించి వెళ్ళిపోయినాడు. ప్రతి ఉదయము మానవునిలో క్రొత్త ఆశలు రేకెత్తించును. యోగి చెప్పిన మాటలే నా లక్ష్యముగా నిర్ణయించుకొన్నాను. నాయాసలు అడియాసలు కాకుండా కాపాడుము. నా జీవిత లక్ష్యము నెరవేర్చుము. నా ప్రార్థనలు మన్నింపుము. దేవదేవా ! గ్రహగతులను నా పై అనుకూల దృష్టి కలిగి నడిపింపుము స్వామీ ! ప్రతి సూర్యోదయము నేనిట్లే నా బాధలు నీతో మొరపెట్టు కొనుచున్నాను. ఈ యగచాట్ల నాపివేయుము.

(వెనుదిరిగి చూచి)

అయ్యయ్యో! గురుకులమున గంటలు మ్రోగుచున్నవి. గురువుగారు ఎదురు చూచెదరు. వెళ్ళవలెను.

(సూర్యదేవునకు మరొక్కమారు నమస్కరించును. గురుకులము వైపుగా పరుగుతీయును. చంద్రగిరి పట్టణమునకు వెలుపలగా ప్రశాంతమయిన స్థలములో ఉన్న గురుకులములోనికి పరుగు నడకలతో ప్రవేశించును. ఒక వటవృక్షము క్రింద వితర్ది మీద గురువు కూర్చుని శిష్యులకు పాఠములు చెప్పుచుండును. వేరు వృక్షముల క్రింద వేరు తరగతుల విద్యార్థులు సంతలు చెప్పుకొనుచుందురు. అందరివైపు పలకరింపుల చూపులు ప్రసరింపచేసి ముందునకు నడుచును)

గురువు: తిమ్మర్సూ! తిమ్మర్సూ !!

(గురువు గారి పిలుపు వినిపించదు. సంతలు చెప్పుకొనుచున్న శిష్యుల కంఠస్వరములో కలిసిపోవును)

ఓహో ! అర్సు అనునది కన్నడములో రాజశబ్దమే ! అయినా తిమ్మరాజు అని పిలువవలయును! కాబోలు.

సాళువ తిమ్మరాజా ! రాచిరాజు పుత్రకా! ఇటురా!!

తిమ్మరుసు: (వ్యంగ్యముగా పిలిచినారని గ్రహించును. దగ్గరగా చేరి చేతులు కట్టుకుని వినయముగా నిలచును).

పిలిచారా గురుదేవా!!

గురువు: అవును ఒకసారి కాదు. పదిమార్లు.

తిమ్మరుసు : వినిపించక వెళ్ళు చుంటివి. క్షమించగలరు.

గురువు : నిన్న చెప్పిన పాఠము వచ్చినదా ? వంతకెళ్ళినదా ?

తిమ్మరుసు : వచ్చినది గురుదేవా !!

(గడ గడ అప్పగించును. అందరు దిగ్భ్రాంతులగుదురు)

గురువు : చెల్లిని తమ్ముని బంధువులింటికి తీసికొనిపోయి తిరిగి వచ్చావని విన్నాను. ఎప్పుడు వల్లెవేశావు ?

తిమ్మరుసు: (భయంగా) వల్లెవేయలేదు.

గురువు : మరి పాఠం ఎలా వచ్చిందో చెప్పు ?

తిమ్మరుసు : విన్నప్పుడే వచ్చినది.

గురువు : ఓహో! అయినచో ఏక సంథాగ్రాహివా ! ఏమి ?

తిమ్మరుసు : ఆ సంగతి నాకు తెలియదు. కాని పాఠము వచ్చినది.

(విద్యార్థులు కొందరు నవ్వుదురు).

గురువు: ఎందుకా ఎకసక్కెములు. తెలివితేటలు, ఏకాగ్రత అనునది సాధనలో వచ్చును. లేదా దైవదత్తముగా వచ్చును. ఈ వరము కలిగిన విద్యార్థులకే కొన్ని శాపములే కూడ ఉండును. పాపము పేదరికము. అది పరిహాస పాత్రము కాదు.

(కన్నులు పెద్దవి చేసి) తిమ్మరుసును చూచి నవ్వినవారు పాఠమును ఒక్కసారి విని అప్పగించగలరా ?

(విద్యార్థులు నిశ్శబ్దముగ నుందురు)

నాయనా ! నీవు తెలివయిన వాడవు. ఈ దినము దుర్గాధ్యక్షుల వారు విద్యార్థులను పరీక్షించుటకు పూనుకొనిరి. వారిచ్చు బత్తెముతోనే కదా మీకు విద్యాబోధనము చేయగలుగుచున్నాను. కనుక నీవు ఎక్కడకు వెళ్ళకుము.

తిమ్మరుసు : అటులనే గురుదేవా !!

(తనతోటి విద్యార్థుల మధ్యకు వెళ్ళి కూర్చుండును. పాఠములు సాగుతూ ఉండగా గుర్రపుడెక్కల చప్పుడు వినిపించును. ఒక భటుడు గుర్రము దిగి వచ్చి ఉపాధ్యాయునికి ఒక వలక చూపించును. ఉపాధ్యాయుడు అయోమయముగా ఆలోచించుచుండును. విద్యార్థులు గుమిగూడుదురు).

గురువు : మీలో ఎవరయినా ఈ సమస్య తీర్చగలరా ?

భటుడు : గురువు చేయలేని పనులు శిష్యులు చేయగలరా ? (నవ్వును)

గురువు : అలా అనకు నాయనా ! ముఖే ముఖే సరస్వతి. అయంబ ఎప్పుడెవ్వరి నాలుకమీద నాట్యమాడునో తెలియగలవారెవ్వరు ? (విద్యార్థుల వంక చూచి) చెప్పుడు 'మీలో ఎవరయినా ఈ సమస్య తీర్చగలరా ?

(అందరు మౌనముగా చూచుచుందురు)

విద్యార్థులంతా వచ్చితిరా? ఇంకెవ్వరయినా రావలెనా ?

విద్యార్థులు : తిమ్మరాజు చెట్టుక్రిందనే కూర్చుని ఉన్నాడు.

గురువు : తిమ్మరుసూ ! నీ విటురమ్మా !

(దగ్గరగా వచ్చి వినయముగా నిలచును)

అక్కడనే కూర్చుంటివేమి ?

తిమ్మరుసు : అది దుర్గాధ్యక్షుల ప్రశ్న కదా ! పెద్దల విషయము నాకేమి తెలియును. పండితులే విచారించవలెను.

గురువు : అసలీ సమస్యను నీవు చూచితివా ?

తిమ్మరుసు : చూడలేదు గురుదేవా !

గురువు : (పలక చూపించి) ఇదిగో ! ఈ పలక మీద ఒక గీత గీచియున్నది. దీనిని చెరిపి వేయకుండా చిన్నది చేయవలయునట. అదెలా సాధ్యమో మరి ?

(గీత వంక దీక్షగా చూచుచుండును)

నీకేమయిన ఉపాయము తోచినదా ? లేదా ??

తిమ్మరుసు : చాల చిన్న ప్రశ్న. సమాధానము తోచినది.

గురువు : (సంతోషముగా) అయినచో చేసి చూపించుము.

(తిమ్మరుసు పలకా బలపము చేతికి తీసుకొనును. దుర్గాధ్యక్షుల వారు గీచిన గీత క్రింద మరొక పెద్ద గీత గీయును. గురువుతో కలిసి మిగిలిన వారందరు ఆశ్చర్యపడుదురు)

తిమ్మరుసు: చూచితిరా గురుదేవా ! దుర్గాధ్యక్షుల వారి ప్రశ్నకు ఇదే కదా సరి అయిన సమాధానము ?

గురువు : అవును నా శిష్యుడవనిపించుకున్నావు. భావి కాలములో నీవు అఖండ ప్రజ్ఞాశాలివి కాగలవు.

తిమ్మరుసు : మీ ఆశీస్సులే చాలును.

(గురువుగారు భటునికి పలక బలపము ఇచ్చి పంపి వేయును. మరి కొంతసేపటి తరువాత అతడు తిరిగి వచ్చును)

భటుడు : మీరిరువురను దుర్గాధ్యక్షుల వారు తోడ్కొని రమ్మన్నారు.

గురువు : (కంగారుగా) మావలన ఏదయిన పొరపాటు జరిగినదా ?

భటుడు : (నవ్వి) భయపడకుడు. వారికి మీ యందు అనుగ్రహము కలిగినది. మంచి బహుమానము ఇవ్వవలయునని ఆలోచించి నన్ను పంపించారు.

గురువు : సరే నీవు వెళ్ళుము. మేము వచ్చుచున్నామని వారితో నివేదించుము (స్థిమిత పడును). నాయనా తిమ్మరుసూ !

తిమ్మరుసు : వచ్చితిని. వచ్చితిని. (దగ్గర చేరి వినయముగా నిలచును)

గురువు : నాయనా ! దుర్గాధ్యక్షులవారు బహుమానములిత్తురట ! నీవు వీధులలో విస్తళ్ళు అమ్ముచుండగా చూచి జాలిపడి తీసుకువచ్చి తెలివితేటలు నేర్పితిని. విద్యవలన జ్ఞాన నేత్రము కలుగును. అట్టి అవకాశము ఆనాడు నేను నీకు ఇవ్వనిచో ఈన్నాడింతవాడవు కాగలవా ?
నీకున్న తెలివితేటలకు ముందు ముందెన్నో మాన్యతలు, సమ్మానములు పొందగలవు. నేను బహుకుటుంబిని. ఇప్పుడు దుర్గాధ్యక్షుల వారిచ్చు బహుమతులు నాకు ఇచ్చివేయుము. కొన్ని కుటుంబ సమస్యలు తీర్చుకొందును. చిన్నవాడవు కదా ! అంత ధనమును నీవేమి చేసుకొందువు?

తిమ్మరుసు: అటులనే గురుదేవా ! మహాభాగ్యము.

గురువు : వారితో నీవేమి చెప్పెదవు.

తిమ్మరుసు ఈ సమస్యను పూరించినది మీరే అని చెప్పెదను. జ్ఞానము కలిగిన సమయస్ఫూర్తి కలుగును. ఆ జ్ఞానమును నాకు కలిగించిన వారు మీరే కదా! నా తండ్రి తాతలు దుర్గములలో కొలువులు చేసిన వారు అని తెలిసి, నా స్థితికి జాలిపడి ఆధారము కల్పించితిరి. అంతేకాక గురువు అజ్ఞానము తొలగించువాడు.

శ్లోకం : **అజ్ఞానాంధ స్తిమిరస్య**
**జ్ఞానాంజన శలాకయా**
**చక్షురున్మీలితం యేన**
**తస్మై శ్రీ గురవేనమః** అన్నారుపెద్దలు.
మీకు నమస్కరించి సంతోషముగా సమర్పింతును.

గురువు : అయినచో బయలుదేరుము.

(ఇరువురు దుర్గాధ్యక్షుని వద్దకు బయలు దేరుదురు. నగరము చూచుచు వారి మందిరము చేరుదురు. భటుడు కూడ దుర్గాధ్యక్షుని ప్రక్కనే నిలచి ఉండును.

మందిరము మధ్యలో ఒక బల్లమీద పాత్ర నిండా వరహాలు పోసి ఉండును. దుర్గాధ్యక్షుడు మందస్మితము చేసి తలయూచి ఆహ్వానించును).

దు.అ: దయచేయుడు! దయచేయుడు!!

(ఆసనములను చూపించును. వాటిమీద కూర్చుందురు)

మీ ఇరువురిలో సమస్యను పూరించినవారెవరు ?

తిమ్మరుసు: మా గురువుగారే పూరించిరి.

దు.అ: (భటుని వంక చూచును. భటుడు రహస్యముగా ఆతని చెవిలో ఏదో చెప్పును. దుర్గాధ్యక్షుడు నవ్వును. గురువుతో) మీరేనా సమస్యను పూరించినది?

గురువు : ఆ బహుమానము నాకే ఇండు.

దు.అ: నా సమస్యను పూరించినవారు చురుకైన మేధావులు. కావున వారికి బహుమానముగా వరహాలు ఇవ్వదలచితిని. బల్లమీద రజితపాత్రలో నున్న వరహాలను మీరు తీసుకొనవచ్చును.

గురువు: (సంతోషముగా) ప్రభువులకు ధన్యవాదములు. అటులనే తీసుకొందును (లేచి నిలచును. వెళ్ళుటకు ఉద్యమించును).

దు.అ: (ఆగుడు) ఈ బహుమానమును తీసుకొనుటలో కూడ మీ తెలివితేటలకు పరీక్ష కలదు. బల్లచుట్టూ పట్టు వస్త్రములు పరచియున్నవి. వాటిని త్రొక్కకుండా మాత్రమే బల్ల దగ్గరకు వెళ్ళి బహూకృతిని అందుకొనవలెను.

గురువు : (నిరుత్సాహముగా) బల్లకు అన్నివైపులను పట్టువస్త్రములు పరచియున్నవి కదా ప్రభూ ! వాటిని త్రొక్కకుండా పాత్ర తీసుకొనవలయునన్నచో ఆకాశ గమనము రావలయును. ఖేచరీ విద్య నాకు రాదు. అనుగ్రహింపుడు.

దు.అ: ఇది కూడ మీ ప్రజ్ఞకు ఒక పరీక్ష ! ఓడిపోయినచో బహూకృతి పొందలేరు. ప్రయత్నించుడు.

గురువు: శిష్యా! తిమ్మరుసూ! ఇది అసాధ్యమయిన పరీక్ష. మనము తిరిగివెళ్ళిపోవుదము. మరిక గత్యంతరము లేనేలేదు.

తిమ్మరుసు : మీకు నిరుత్సాహమెందులకు గురుదేవా ! ఆ పాత్రను నేను తీసుకొని రాగలను.

దు.అ: పట్టు వస్త్రములను త్రొక్కినయెడల శిక్షార్హులగుదురు.

తిమ్మరుసు: ఈ విషయమును ముందే వివరించితిరి కదా ?

(పట్టువస్త్రములను త్రొక్కకుండా మడతలు వేయుచు బల్ల దగ్గరకు పోవును. పాత్రను తీసుకొని తిరిగి పట్టువస్త్రము మడతలు విప్పుచు వెనుకకు వచ్చును. వరహాల పాత్రను గురువుగారికి అప్పగించును. అతడు సంతోషించును).

దు.అ: ఓహోహో! అనన్య సామాన్యమయిన ప్రజ్ఞాపాటవములివి. నీవు నిజమయిన మేధావివి. చక్కని సమయస్ఫూర్తి కలిగినవాడవు. ఏమందురు పంతులుగారూ!

గురువు : అవునవును. నేనే ఈతనికి చక్కని జ్ఞానమును ప్రబోధించితిని. అందువలన మేధావియయినాడు.

దు.అ: అయినచో పెద్ద గీతను చిన్నగీతగా మార్చిన మేధావి కూడ ఈతడే అయి వుండవలెను కదా !

(గురువుగారు తలదించు కొనును)

ఉపాధ్యాయులు అనృతములాడరాదు కదా!

గురువు : (సిగ్గుతో) దురాశకు బోయితిని. ఓహో ! ఈ దురాశ ఎంత నిష్ఫలమయినది. ఎంతవారిని కూడ తలదింపుకొనునట్లు చేయును. కాని దీనిని మానవుడు జయించలేడు.

'అజీర్ణే భోజనం విషం' - అని ఆర్యులందరు ఆరగించుకోలేని దానికై మానవులు ఆశపడకూడదు.

### పద్యము

**కుక్షికెనయగు నన్నంబు కూరలైన**
**బలము నారోగ్యమిచ్చును బహువిధముల**
**క్షుత్తులేక తినిన కాలకూటమగును**
**ఆశకలుగుట మేలు దురాశతగదు॥**

ఈ నీతి నాకు తెలిసియు నాచరించలేకపోయితిని. దురాశ వలన కలిగిన దుష్ఫలమిది. దుర్గాధ్యక్షా ! నన్ను మన్నించి ఈ బహుమానము నా విద్యార్థికే యిండు !

తిమ్మరుసు: మేము ముగ్గురము. నా సోదరుడు, చెల్లెలు. నేను వీధుల వెంట తిరుగుచూ దిక్కుతోచని స్థితిలో ఈ యుపాధ్యాయుడు మమ్ములను చేరదీసి ఆశ్రయమిచ్చినారు. తెలివితేటలు నావే అయినను జ్ఞాన ప్రబోధము చేసిన మహానుభావులు వీరు. కనుక ఈ బహరాకృతి వారిదే !

గురువు: కాదు. నాశిష్యునికే దక్కవలయును.

దు.అ: (చిరునవ్వు నవ్వి) మీ వివాదమును నేను తీర్చెదను. మీ ఇరువురకు బహుమతులు ఇచ్చెదను. ఇరువురును గొప్పవారే ! (భటుని చూచి) వరహాలు నింపిన మరొక పాత్ర తెప్పింపుడు (భటుడు వెళ్ళి వరహాలు నిండిన పాత్ర తెచ్చి యిచ్చును. గురువు గారది స్వీకరించి సంతోషించును).
(తిమ్మరుసును ఉద్దేశించి) మేధావీ ! నీవు కాస్సేపు ఆవలకు బొమ్ము. (తిమ్మరుసు వెలుపలకు వెళ్ళును).
గురువుగారూ ! ఈ మేధావిని నాకు లభ్యపరచినందులకు ధన్యవాదములు. మీ గురుకులము బాగా నడచుచున్నదా ?

గురువు: మీ సహాయ సహకారముల వలన బాగానే యున్నది.

దు.అ: మిమ్ములను నేను అర్థము చేసుకుంటిని. మీరన్నట్లు దురాశ పనికిరాదు. కాని దారిద్ర్యము దుర్భరమయినది. ఇటువంటి మేధావిని నా కందించినందులకు బహుమానమే కాదు అతనికి కావలసినదెల్ల నేనిత్తును. విద్యాబుద్ధులు గరపించి జాతిరత్నముగా తయారు చేయుడు. ఒక మేధావి తన పూర్ణవికాసము పొందుటకు బాధ్యత కల గురువులు వ్యయప్రయాసల కోర్చవలెను. వ్యయము నాది, ప్రయాస మీది. ఇకమీదట మీ లక్ష్యమును అతనిపై నిలిపి ప్రోత్సహించుడు. సరియగు సమయములోనే నీతనిని పిలిపింతును.

గురువు : ధన్యుడను ప్రభూ ! ఒక మంచి శిష్యుని వలన గురువు బాధలు తొలగుట అరుదు. అట్టిది ఈనాడు జరిగినది. నాశక్తిని ధారపోసి అతనికి సమస్త విద్యలు బోధింతును.

దు.అ: తిమ్మరుసూ! (తిమ్మరుసు లోనికి వచ్చును.) ఇరువురు మరిన్ని బహుమానములు అందుకొందురు. ఆశ్రమమువైపుగా నడుచుదురు. ఆశ్రమములోని విద్యార్థులా బహుమతులు చూచి సంతోషించెదరు. తిమ్మరుసు పై చులకన అభిప్రాయమును విడిచి గౌరవముగా చూచెదరు. ఉపాధ్యాయుడు పాఠములు చెప్పుట ప్రారంభించును.

## రెండవ రంగము

(చిమ్మచీకటి. మనుష్యులు ఒకరికొకరు కన్పింపరు. మాటలు మాత్రమే విన్పించుచుండును).

ఒకరు: అడుగుల చప్పుడు వినిపించుచున్నది. వచ్చినవారెవరు?

దు.అ: చిట్టి గంగన్న అమాత్యులవారికి ప్రణామములు.

చి.గం: ఓహో! నీవా చంద్రగిరి దుర్గాధ్యక్షా !

దు.అ: అవును దేవరా! మీరు అత్యంత గోప్యముగా రమ్మని పిలిచిన కారణమేమియో నడుగదగునా !

చి.గం: అవశ్యము. నేను వృద్ధుడనయితినని అందరెరుగుదురు కదా ! మరియెంతయో కాలము జీవింపలేననిపించుచున్నది.

దు.అ: దైవనిర్ణయమెట్లున్నదో ఎవరికి తెలియును. ఇంతకాలము మీ మంత్రాంగ బలముచేత చంద్రగిరి రాజ్య ప్రభువు అయిన సాళువ నరసింహరాయలవారు క్షేమముగా పాలించిరి. ఇప్పుడు పరిస్థితులు మారుచున్నవి. కొండపల్లి, కొండవీడులను పరిపాలించు గజపతులు, ఉమ్మత్తూరు ఉదయర్లు, ముదిగల్లు, రాయచూరుల నేలు బహమనులు, విజయనగరమును పాలించు రాయర్లు, అంతియేకాక చోళ, పాండ్య, చేర రాజ్యముల ప్రభువులు అందరూ ఈ చంద్రగిరి రాజ్య రాజధానియగు నారాయణవనము మీదికి దండెత్తి రావలయునని చూచుచున్నారు. ఇది చాల కష్ట సమయము. గుత్తి దుర్గము సేనాపతియగు తుళువ నరసరాయల వారొక్కరే మనకు అనుకూలురు.

ఈ సమయములో మీ మేధా సంపద ఒక్కటే చంద్రగిరి ప్రభువులయిన శ్రీసాళువ నరసింహరాయలవారిని కాపాడగలదు.

చి.గం: కాని ఈ బాధ్యత నెరవేర్చునంత వరకు నేను జీవింతునని నమ్మకము లేదు. ఏ ఒక్కరికి పరిస్థితులను అనుసరించి అయువు పెరగదు కదా ! ఏదో ఒక మహా పరిణామము జరుగవలెను. అది ఈ చంద్రగిరి రాజ్యమునురక్షింపవలె!

దు.అ: యువకుడయిన మరొకమంత్రిని నియమించిన ఎట్లుండును ?

చి.గం: సమర్థుల కొరకు అన్వేషించుచుంటిని.

దు.అ: మంత్రిగా మీరు ప్రదర్శించిన సామర్థ్యము అనన్య సామాన్యము. మీ అంతటి వారు మరల ఈ చంద్రగిరికి లభించెదరని ఎవ్వరును విశ్వసింపజాలరు. కాని చంద్రగిరి గురుకులములో నొకబాలుడున్నాడు. అతని ప్రజ్ఞాపాటవములు అనన్య సామాన్యముగా కన్పించుచున్నవి. మంత్రిగా తమ శిష్యరికమును స్వీకరించు లక్షణములన్నియు అతనికి కలవని నా నమ్మకము. నేను బత్తెమిచ్చి గురుకులములో విద్యాబుద్ధులు చెప్పించుచుంటిని. కాని వయసు రెండు పదులే !

చి.గం: మంత్రి పదవికి వయసుతో నిమిత్తము లేదు దుర్గాధ్యక్షా! ప్రజ్ఞ ఒక్కటే చాలును. కాని అతడు విధిగా రాజకుటుంబ క్షేమమునకు బద్ధుడయి ఉండవలెను. ఆశకు అతీతముగా విశ్వాసము కలిగి పాత్రత తెలిసినవాడయి ఉండవలెను.

దు.అ: చిట్టి గంగన్న అమాత్యా! అతడు అటువంటి వాడేననుటలో నాకు ఎటువంటి సందేహము లేదు. ఎందుకనగా ఈ బాలుని తాత వేమరాజుగారు. వేమరాజుగారు కొండవీటిలో దళవాయిగా ఉంటూ ప్రభువుల రక్షణకే ప్రాణములు అర్పించిరి. ఈతని తండ్రి కొండవీటి నుండి చంద్రగిరికి వలస వచ్చిన రాచిరాజు కూడ సైన్యములో పనిచేసి ప్రాణములర్పించెను. అందువలన పిల్లలు ముగ్గురు అనాధలైరి. ఈ మధ్యనే నేను ఆర్థిక సాయము చేయగా మీసోదరుని మనుమనికి ఆడపిల్లను కృష్ణాంబను ఇచ్చి పెండ్లి చేసిరి. కనుక తిమ్మరాజు (తిమ్మరుసు) గోవిందరాజు (గోవిందరుసు) మీకు బంధువులు కూడ అగుదురు. తిమ్మరుసు తెలివితేటలను అనేక మారులు వినోదార్థముగా నేను పరిశీలించితిని అతడు రెండు పదుల వయసు వాడయినా ఎనిమిదిన్నర పదుల వయసున్న మిమ్ములను అడుగడుగున నాకు గుర్తుచేసినాడు. అసాధారణ మేధావి నిస్సందేహముగా !

చి.గం: కాలగతి నమ్మరానిది. నీవు తక్షణమే అతనిని నా దగ్గరికి పంపించుము. నేను పరిశీలించెదను. ఈ చంద్రగిరి దుర్గ భవితవ్యమును ఆ శ్రీనివాసుడెట్లు నిర్ణయించినాడో మరి? చూడు! ఈ రాజకీయములేవియు అతనికి చెప్పకు మాకు దూరపు బంధుత్వమున్నదన్నావు కదా ! ఆ మిషతో నా దగ్గరకు వచ్చునట్లుగా చేయుము. ఏ పదవికి అర్హుడో స్వయముగా నేను పరీక్షించి

నిర్ణయించుదును. విప్లవకారులకు సమాధానము చెప్పగల శక్తివంతులైన యువకులే మనకిప్పుడు కావలయును. గుత్తి దుర్గాధ్యక్షుడయిన శ్రీ తులువ నరసరాయలకు కూడ నేను రమ్మన్నానని వర్తమానము అందించుము.

దు.అ: తమ యాజ్ఞ శిరసావహించెదను.

చి.గం: ఇక నీవు వెళ్ళి రావచ్చును.

దు.అ.: ధన్యుడను మంత్రివర్యా!! (వెళ్ళును. తెరవాలును)

## ప్రవేశకము

నటుడు : (ప్రవేశించును) నటీ శిరోమణీ! త్వరగా రమ్ము. రమ్ము.

నటి: (వచ్చి) అకాలవర్షము వలె ఈ రాక ఏమి ?

నటుడు: ప్రధమాంకము చూచితివి కదా ! చరిత్ర అనగా ఒకనాటి సంఘటన కాదు. ఒకచోట దృశ్యము కాదు. ప్రధమాంకము ముగిసిన ఈ సమయమున మరికొన్ని విషయములు నీకు వివరింతును. అప్పుడు ద్వితీయాంకము ప్రారంభమగును.

నటి: అయినచో త్వరగా చెప్పుము.

నటుడు: దుర్గాధ్యక్షుని దయ వలన సహృదయత వలన తిమ్మరుసు చిట్టిగంగన్న మంత్రిగారి వద్దకు చేరెను. ఆ తరువాత మంత్రి పదవి ఏ విధంగా నిర్వహించవలెనో అతనికి మంత్రివర్యులు బోధించిరి. ఎన్నో మెళకువలు చెప్పి ఆయన కన్నుమూయగా శత్రువులు విజృంభించారు. తిమ్మరుసు చాకచక్యముతో వాటిని త్రిప్పికొట్టి చిట్టి గంగన్నపేరు నిలబెట్టెను. నటీమణీ! ప్రతిభకు వయసుతో నిమిత్తం లేదు. కాని దురదృష్టవశాత్తు రాయర్లు పాలించే విద్యానగరంలో కల్లోలం చెలరేగింది. మూడవ హరిహరరాయలు వ్యసనపరుడు. అంతఃశత్రువులు, బహిఃశత్రువులు విజృంభించారు. అతని పాలన అంతంకాక తప్పదని తిమ్మరుసు మహామంత్రి గమనించాడు. విద్యానగరం శత్రువుల కైవసం అయితే ప్రక్కలో బల్లెంలా శాంతిని హరిస్తుంది. అందువల్ల బలహీనుడైన మూడవ హరిహరరాయల మీదికి అందరికన్నా ముందుగానే సాళువ నరసింహరాయలు దండెత్తి వశం చేసుకోవాలని తిమ్మరుసు పథకం వేశాడు.

నటి: విజయనగరం వారు సాళువ నరసింహరాయలకు మిత్రులే కదా? ఎందుకు దండెత్తారు ?

నటుడు: అదే తిమ్మరుసు మహామంత్రి ముందుచూపు. ఉపేక్ష వహిస్తే విద్యానగరం మరొకరి వశం అవుతుంది. అప్పుడు చంద్రగిరి సరిహద్దులమీద శత్రువుల రాజ్యం అవతరిస్తుంది. ఈ ప్రమాదం నుంచి రాజ్యాన్ని రక్షించేందుకే మిత్రుని మీద యుద్ధం చేయించాడు. ఇది క్రీ॥శ॥ 1486-87 లో జరిగింది. పతనం కాక తప్పనప్పుడు పరహస్తం కాకూడదు. మిత్రుల వశం కావాలి. అదే మహామంత్రి రాజనీతి. గుత్తి దుర్గాధిపతి అయిన తుళువ నరసరాయలు దండనాయకుడు అయి యుద్ధానికి విజయనగరం మీదికి వెళ్ళారు. తన అసమర్థతని గమనించి మిత్రులే దండెత్తి వస్తున్నారని గ్రహించిన మూడవ హరిహరరాయలు విద్యానగరాన్ని యుద్ధ ప్రమాదం లేకుండా అప్పగించి పారిపోయాడు. విరక్తితో అలా చేశాడు.

నటి: ఎందుకు చేస్తేనేం? మన తిమ్మరుసు వారు ఇప్పుడు విద్యానగరం మహామంత్రి అయ్యారన్నమాట!

నటుడు: అవును. తన తమ్ముడయిన గోవిందరాజుని నగర రక్షకునిగా నియమించాడు. తుళువ నరసరాయలు గుత్తి దుర్గాధిపతి కదా ! అతడిప్పుడు విద్యానగర సైనిక దళాలకు నాయకుడు అయ్యాడు. సాళువ నరసింహరాయలకు వయసు మీద పడింది. 'జర రుజలు' కారణంగా కన్నుమూశాడు. అతని కుమారునికి పట్టం కట్టగా అతడు హత్యకు గురి అయ్యాడు. అలాంటి స్థితిలో మహావీరుడయిన తుళువ నరసరాయలను విద్యానగర సింహాసనం మీద ప్రతిష్టించాడు. సాళువ రాజుల పరంపర కనుమరుగు అయింది. విద్యానగరంలో తుళువ వంశ చరిత్ర ప్రారంభమయింది. ఇలా జరగటానికి తిమ్మరుసు మహామంత్రి కొందరు అభిమానుల కన్నెరకు గురి అయ్యాడు.

నటి: తుళువ నరసరాయులు పాలన ఎలా చేశాడు?

నటుడు: అతడు స్వయంగా మహావీరుడు. మహామంత్రి తిమ్మరుసు వారికి అభిమానపాత్రుడు. అంతేకాక ఆయన కుమారుడే ఆంధ్రుల అభిమాన

కథానాయకుడు శ్రీకృష్ణదేవరాయలవారు. అష్టదిగ్గజాలను పోషించి కావ్యాలు వ్రాయించారు. స్వయంగా కావ్యాలు వ్రాశారు. కటకం దాకా జయించారు.

నటి: ఓహో! ఇప్పుడు అర్థమయింది నట మహాశయా! కథని అక్కడకు నడిపించటానికే మన ప్రవేశకమును కల్పించారన్నమాట!

నటుడు: ముందు ఈ వివరాలు విను నటీమణీ! ఆలస్యమవుతోంది.

నటి: ఈ విషయాలు విన్న తరువాతనే నాటకంలో రుచి తెలుస్తుంది కదా నటశేఖరా! (ఆసక్తిగా) చెప్పు చెప్పు.

నటుడు: తుళువ నరసరాయలు ప్రభువుకు భార్యలు ముగ్గురు.

నటి: ఓస్! అంతేనా! నా ఆరాధ్యదైవం శ్రీకృష్ణ పరమాత్మకు పదహారు వేలమంది భార్యలు తెలుసా?

నటుడు: అది పురాణం. ఇది చరిత్ర. అడ్డురాకుండా విను మరి. నరసరాయల భార్యల పేర్లు చెప్తాను. పట్టపురాణి పెద్ద భార్యపేరు తిప్పాంబ. ఈమెకు వీరనరసింహరాయలనే పేరుగల కుమారుడున్నాడు.

నటి: మరి రెండవ భార్య ఎవరు ? ఎందరు సంతానం?

నటుడు: నాగాంబ. ఆమె సంతానమే శ్రీకృష్ణదేవరాయలు.

నటి: మూడవ భార్య గురించి కూడ చెప్పు నటశేఖరా!

నటుడు: ఆమె పేరు ఓబాంబ. అచ్యుతరాయలు, రంగరాయలు అని ఆమెకు ఇద్దరు కుమారులు. సంతానం వృద్ధి అయినట్లే రాజ్యం కూడ విస్తరించింది. తుళువ నరసరాయలు మహారాజుకు నీరు చూపింది. భిషగ్వరులు బ్రతకటం కష్టమంటున్నారు. ఇప్పటి కథాకాలం క్రీ॥శ॥ 1503.

నటి: నీరు చూపిన తుళువ నరసరాయల పరిస్థితి ఏమయింది?

నటుడు: ఈ విషయం మాత్రం నేను చెప్పను నటీమణీ! చూపుతాను. ప్రదర్శన ప్రారంభమవుతోంది. వెడదాం పద!

నటి: అయ్యో పాపం! అంత కష్టం వచ్చిన మహారాజు ఏమయ్యారో చూడాలి కదా మరి? పద! పద!

(ఇద్దరు నిష్క్రమించెదరు. తెరవ్రాలును)

# ద్వితీయాంకము

(విద్యానగరం కోట. అంతఃపురం. రాజు శయ్యమీద ఉండును. రాణులు, పుత్రులు, భిషక్కులు, మంత్రులు చుట్టూ విచార వదనములతో నిలిచి ఉందురు).

తు.న: (హీనస్వరముతో) శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో మరణించే ముందుగా మానవసంబంధాలను విడిచి తనను స్మరిస్తే తన దగ్గరకు చేర్చుకుంటానని చెప్పాడు. కనుక తిమ్మరుసు మహామంత్రితో నా చివరి కోరిక చెప్పుకుంటాను. ముందు సంశయాన్ని త్యజించి ఆ తరువాత ప్రాణాలు విడిచిపెట్టుకుంటాను. మీరంతా బయటికి వెళ్ళండి. (తిమ్మరుసు మహామంత్రి తప్ప మిగిలినవారు అందరూ దూరముగా వెళ్ళి నిలచియుందురు.) మహామంత్రి! మనము బహుకాలము అన్యోన్యముగా, ఆప్యాయముగా, ఏకాభిప్రాయముగా నుంటిమి. ఎన్నో ఘనకార్యములను సంయుక్తముగా సాధించితిమి. నీ సహకారముతో నేను చరిత్ర సృష్టించితిని. నా బిడ్డలు చిన్నవారు. నా మరణము తరువాత వారిని నీవే చూచుకొనవలెను. రక్షించవలెను. సవతుల మధ్య అసూయలు సహజమే కదా ! శ్రీకృష్ణదేవుని తల్లి అయిన నాగాంబపై తిప్పాంబకు వల్లమాలిన అసూయ. ఒకనాడు వేడుకగా తిప్పాంబతో పాచికలాడుతూ నాగాంబను దాసిగా ఒడ్డి ఓడిపోయితిని! దానిని నిజమని ప్రచారము చేసి శ్రీకృష్ణదేవరాయలు దాసీపుత్రుడు రాజ్యపాలనకు అనర్హుడు అనుచున్నది. అందువల్ల తన పుత్రుడయిన వీరనరసింహరాయలకే పట్టము కట్టమనుచున్నది. శ్రీకృష్ణదేవుడు గొప్ప లక్షణములతో నున్నాడు. అతని మీద నాకు మక్కువ ఎక్కువ. నా తదనంతరము ఎవరిని రాజుని చేయవలెననే అంశము మీ విచక్షణకే వదలివేయుచున్నాను.

కాని తుళువ వంశపాలన పట్ల అసూయ ద్వేషములతో క్రుగ్గుచున్న సాళువ వారికి తిరిగి ఈ సింహాసనము అప్పగించనని మీరు మాట యిచ్చిన చాలు. నిశ్చింతగా కన్నుమూయుదును.

తిమ్మరుసు: మహారాజా! నేను సాళువ తిమ్మరాయలనే ! నాతండ్రి సాళువ రాచిరాజు!

అయినను నేను ఆ పక్షము వహించను. ధర్మపక్షమే వహిస్తాను. సాళువ పాలన అంతమయినది. దానిని ద్రోహబుద్ధితో తిరిగి రప్పించను. తుళువ నరసరాయలవారు పట్టాభిషిక్తులు! వారి తరువాత ఈ సింహాసనము వారి పుత్రులకే చెందుతుంది. పాడి తప్పి ప్రవర్తించను. ఆడి తప్పను. ఇది మనకు గల బహుకాలమైత్రి సాక్షిగా నా వాగ్దానము.

తు.న: మీరు స్వార్థబుద్ధులు కారు. ఈ జీవితము ఇక చాలు. పరంధాముని ఒడి చేరుకుంటాను. కృష్ణా....కృష్ణా (చేతులు జోడించి నమస్కరించ ప్రయత్నించును. ప్రాణములు అవసానములు కాగా చేతులు వ్రాలిపోవును. తిమ్మరుసు మహామంత్రి తుది నివాళి సమర్పించి వచ్చి మిగిలినవారితో కలియును).

తిమ్మరుసు: దళపతులారా! రాజ్యము అరాచకముగా నుండరాదు. వెను వెంటనే తిప్పాంబ పుత్రుడయిన వీరనరసింహరాయల పట్టాభిషేకమునకు ఏర్పాట్లు చేయింపుడు.

దళపతి: బాలునికి పట్టాభిషేకమా ? సాళువ తిమ్మరాయా ! మీరే మహామంత్రి పదవిని కాక మహారాజుగా అభిషిక్తులు కండు. దళపతులందరు మిమ్ములను సమర్థించుచున్నారు.

తిమ్మరుసు: నాకు అట్టి కోరికలు లేవు. చెప్పిన విధి జరిపింపుడు.

దళపతి: (నమస్కరించి) అవశ్యము (వెళ్ళిపోవును) (తిమ్మరుసు ఆలోచనా మందిరమున కూర్చుండును. తిప్పాంబ మొదలయిన అంతఃపుర స్త్రీలు వచ్చెదరు.)

తిమ్మరుసు: దయచేయుడు. ఆసీనులు కండు.

తిప్పాంబ: గుత్తి దుర్గములో అధ్యక్షులుగా ఉన్నప్పటి నుండి తుళువ నరసరాయలతో మీరు మైత్రీభావము కలిగియుంటిరి. ఎన్నో రాజకీయములను కలిసి నడిపించితిరి. ఎన్నో యుద్ధములలో జయించితిరి. విద్యానగరమున గద్దెనెక్కుటయే కాక దక్షిణాపథమంతా దానిని విస్తరించితిరి. మైత్రితో చరిత్రలే సృష్టించితిరి. దానికి చిహ్నముగా మీరిప్పుడేమి చేయదలచితిరి? మహామంత్రి!

తిమ్మరుసు: సాళువ నరసింహరాయలు అధివసించిన విద్యానగర సింహాసనము

విధివశమున తుళువ నరసరాయల వశమయినది. వారి తదనంతరము ఈ రాజ్యపాలనము తుళువ వంశీయులదే కావలెను. అదే ధర్మము. సాళువ పక్షపాతులీ విషయములో కినుక వహించారు. సాళువ తిమ్మరుసే సాళువ వారికి అన్యాయము చేస్తున్నాడని ఆడిపోసుకుంటున్నారు. కాని మహామాత్య పదవి వ్యక్తిగతమయినది కాదు. ధర్మమునే నిర్ణయించితిని!

తిప్పాంబ: మీ ధార్మిక చింతన, నిస్వార్థ సేవానిరతి, మైత్రిపట్ల మీకున్న యాదరము బహుధా ప్రశంసా పాత్రములు. కాని ఇంతటితో మీ బాధ్యత తీరిపోలేదు.

తిమ్మరుసు: మీ మనోగతము వివరించుడు.

తిప్పాంబ: నాకుమారుడు వీరనరసింహరాయలకు పట్టము కట్టుడు. సాళువ తుళువ వంశాభిమానుల రాజకీయములు రాజులపై కుట్రలుగా మారి ప్రాణాంతకములుగా పరిణమించినవి. వెలుపలి శత్రువుల నుండి నా తనయుని మీరు రక్షించెదరని నా భర్త తుళువ నరసింహరాయలవారు విశ్వసించితిరి ! ఇప్పుడు నేను అంతఃశత్రువుల విషయమై మాట్లాడుటకు వచ్చితిని. వీరిని ఉపేక్షించిన నా తనయుడు వీరనరసింహరాయలకు ప్రాణగొడ్డమే కదా ?

తిమ్మరుసు: బయటి రాజకీయ శత్రువులకు సహకరించువారు అంతఃపురము లోపల కూడ నున్నారు. ఈ విషయమై నగర రక్షక పదవిలో నియమించిన నా సోదరుడు గోవిందరాజును కనుగలిగియుండమని హెచ్చరించితిని. స్వయముగా వేగులను నియమించితిని. పరిస్థితి అదుపులోనే యున్నది. భయపడవలదు.

తిప్పాంబ: ప్రక్కలో పాము నుంచుకొని సింహాసనము అధిష్టించుట క్షేమము కాదుకదా! ఈ భయంకర రాజకీయములకు నా కుమారుని బలిచేయలేను. వెంటనే పట్టాభిషేక మహోత్సవమును ఆపుట మంచిది.

తిమ్మరుసు: వీరనరసింహుడే రాజగుట యుచితము. మీ సందేహమెందు గురించి? వివరింపుడు మహారాణీ!

తిప్పాంబ: ఆ నంగనాచి నాగాంబ గురించి!

తిమ్మరుసు: వీరనరసింహుని పట్టాభిషేకము జరుగును. ఇంతకాలము రాజపత్నిగా ఉన్నవారు రాజమాతయగుదురు. మరొకరు మిమ్ములనేమి చేయగలరు?

తిప్పాంబ. ఆ దాసీ పుత్రుడు శ్రీకృష్ణదేవరాయలున్నాడు కదా ! కుమారుని ఉసిగొలిపి

మాకు శాంతి లేకుండా చేయును అవకాశములందివచ్చిన ప్రాణములే తీయును.

తిమ్మరుసు: నాగాంబ సాధుజన విధేయ. సజ్జనురాలు. మీకట్టి సందేహములు వలదు. రాజరక్షణ నా కర్తవ్యము.

తిప్పాంబ: ఒకరి దయాభిక్షకు నా పుత్రుని వదలివేయమందురా!

తిమ్మరుసు: మరి ఏమి చేయమందురు?

తిప్పాంబ: ఆ దాసీ పుత్రునంతఃపురము నుండి తరిమివేయుడు.

తిమ్మరుసు: అతడు మీ భర్తకు అభిమానపాత్రుడయిన కుమారుడు. మీరిట్లు తలపోయుట తగదని నాయభిప్రాయము.

తిప్పాంబ. అట్లయినచో ఈ పట్టాభిషేకం జరుగరాదని నా యభిప్రాయము. ఆ దాసీపుత్రునకే రాజ్యము కట్టబెట్టుడు. నా పుత్రుడు క్షేమముగా నాకన్నుల ఎదుట ఉండినచాలు.

తిమ్మరుసు: ఒక ప్రకటన వెలువడిన తరువాత మరల మార్పులు జరిగినచో కారణములన్వేషింతురు. అంతఃపురమున కల్లోలములున్నవను విషయము శత్రువులకు తెలియును. అది మన ప్రభుతకు ప్రతిష్ట కానేరదు.

తిప్పాంబ: ఏదిఏమైనను నా నిర్ణయము మారదు

తిమ్మరుసు: శ్రీకృష్ణుడు అంతఃపురమున నుండరాదు. అంతియేకదా!

తిప్పాంబ: అది చాలును.

తిమ్మరుసు: అట్లే జరుగును ఇక మీరు నిశ్చింతగా వెళ్ళి తగు ఏర్పాట్లు చేయించుడు. ఈ వ్యవహారము నేను చూచుకొందును రహస్యములు పెదవి దాటిన పృథ్వి దాటును. అంతఃపుర ప్రతిష్టను కాపాడవలసిన బాధ్యత మీయందున్నది.

తిప్పాంబ: నేను రాజపత్నిని. మరియు రాజమాతను. నాకు సమస్తము తెలియును. వెళ్ళుచున్నాను.

(తిప్పాంబ వెళ్ళిపోవును)

తిమ్మరుసు: ద్వారాపాలకా!! (అతడు వచ్చి వినయముగా నిలుచును) నీవు వెళ్ళి శ్రీకృష్ణుని వెంట తోడ్కొని రమ్ము. (ద్వారపాలకుడు వెళ్ళి శ్రీకృష్ణ రాయలను వెంటనిడుకుని వచ్చును. శ్రీకృష్ణుడు ఎంతో వినయముగా నిలుచును) నాయనా! శ్రీకృష్ణా! నీ తండ్రి తదనంతరము నీవు రాజువు కావలయునని అతడు అభిలషించినాడు. నాకు కూడ నీయందే అభిమానం. నిన్నే రాజును చేయుదునని అందరును తలపోసిరి. కాని పరిస్థితులు వేరుగా నున్నవి.

కృ.రాయలు: అప్పాజీ ! మీ ఆశీస్సులు తప్ప నాకేమియునక్కరలేదు.

తిమ్మరుసు: నాయందు నీకు గల గౌరవాదరములు నాకు తెలియును. పదహారు కళలతోకూడిన చంద్రునివలె నీవు సకల విద్యా విశారదుడవు కావలెనని నా అభిమతము.

**పద్యము**

**క్షాత్రము ధర్మదీక్షసుఖకర్షణ కారకదారుణంబ; ఘూ**
**పాత్రమునై పరంగుటిది పాడి భవాన్వయమందు నెప్పుడున్**
**క్షేత్రము నాటు విత్తునకు చీడలు పీడలు సోకు బొప్పు నీ**
**నేత్రము విప్పిచూడుమిక నేర్పున వర్తిలు, వంశ వర్ధనా!!**

కృ.రాయలు: అప్పాజీ! క్షత్రియుల కర్తవ్యములు కఠిన తరములు అని మీ వలన గ్రహించితిని. మీరు అనుమతించినచో శత్రు నిర్మూలనము చేయగలను. ఆనతిండు అప్పాజీ! అంతశ్శత్రువులను బహిశ్శత్రువులను మట్టికరపింతును మీరు నాకు గురువులై సర్వము బోధింపుడు నేను శత్రువులను జయించవలెనన్న సమస్త విద్యాపారంగత్వము కావలెను. అందులకు మిమ్ములనే నమ్ముకొంటిని. వేరు గురువుల నొద్ద విద్యాభ్యాసము చేయుటయు నాకు సమ్మతము కాదు. మీరే నా గురుదేవులు కావలె అప్పాజీ! సమస్త శాస్త్రములలో మిమ్ములను మించిన పండితులు ఎవరున్నారు? మంత్రజ్ఞులే కాదు. విద్వన్మూర్తులు మీరు.

**పద్యము**

**వేదశ్రేణియునర్థ శాస్త్రము ధనుర్వేదంబు సారంబు; ధ**
**న్యా! దివ్యార్థము ధర్మశాస్త్రములును న్యాయంబు దర్కంబు; వి**
**ద్యాదక్షత్వము రాజశాస్త్ర పరిశుద్ధార్థంబు నేర్పింపవే**
**కాదన్నన్ తుళురాయకృష్ణుడిహ భంగం బొందిపోవుంజుమీ॥**

తిమ్మరుసు: అంతమాట అనకయ్యా కృష్ణరాయా ! నా యందు నీకు కలిగిన భక్తి విశ్వాసములకు చాల సంతోషమగుచున్నది. రాజకీయ వ్యవహారములను కాలానుగుణముగా పరిష్కరించుచు పోవలయును. ఇకనుండి నీవు నాయింటనే ఉండి విద్యాభ్యాసము చేయుము. ఉత్తమ రాజ

లక్షణాలంకృతుడవయిన నీవు దైవ కృప వలన ఉజ్వలమయిన భవితవ్యమును పొందగలవు.

(తుళువ శ్రీకృష్ణదేవరాయలను వెంటపెట్టుకుని తిమ్మరుసు మహామంత్రి తన మందిరములోనికి ప్రవేశించును. విద్యాభ్యాసమును ప్రారంభించును. కొంతసేపు గ్రంధములు పరిశీలించును. మరికొంతసేపు సాము గరిడీలు నేర్చును.

విల్లునకు అమ్ములు కూర్చి గురిచూచుట నేర్చుచుండును).

(తెరలోపలనుండి నటుని కంఠస్వరము వినిపించును)

నటుని:

కంఠస్వరం: శ్రీ కృష్ణదేవరాయలావిధముగా విద్యాభ్యాసము చేయుచుండగా అతని మీద తిప్పాంబ హత్యాప్రయత్నములు చేయించినది.

(ఒక ముసుగు మనిషి వచ్చి అతని మీద కత్తి విసరును. దానిని తిమ్మరుసు చాకచక్యముగా పట్టివేయును. అతడు అన్నము తినుచుండగా అభ్యంతరపరచి లోనికి తీసుకుపోవును).

నటుని

కంఠస్వరం: విఘ్నములు కలుగకుండా తిమ్మరుసు మహామంత్రి రక్షించినాడు. అతి కష్టముగా ఆరు సంవత్సరములిట్లు గడచినవి. కృష్ణరాయల విద్యాభ్యాసము పూర్తి అయినది.

ఈ లోగా వీరనరసింహరాయలకు తండ్రివలెనే నీరు చూపినది. ప్రాణభయంతో మహామంత్రికి కబురు పంపాడు.

వా. హ : మహామంత్రివర్యా! అమాత్యశేఖరా!

తిమ్మరుసు: (అతని ఎదటకు వచ్చును. వార్తాహరుడు నమస్కరించును) నీవు వచ్చిన పని యేమి?

వా.హ: మహారాజ వీరనరసింహరాయలవారు తక్షణమే మిమ్ములను వెంటగొని రమ్మని నన్ను పంపితిరి.

తిమ్మరుసు: వారి పరిస్థితి ఎట్లున్నది?

వా.హ: భిషగ్వరులు పెదవి విరిచిరి!

తిమ్మరుసుః (బాధాపూరిత స్వరంతో) అయినచో పద!

(ఇద్దరు వీర నరసింహరాయలు పరుండిన శయ్యను సమీపింతురు)

వీ.న.ః అమాత్యశేఖరా! నమస్సులు!

తిమ్మరుసుః మీ ఆరోగ్య పరిస్థితి ఎట్లున్నది?

వీ.న.ః నా పితృదేవుని మార్గమునే పయనించుచున్నాను

తిమ్మరుసుః అవాచ్యము శాంతించుగాక!

వీ.న.ః అప్పాజీ! చరిత్రగతి వ్యక్తుల కొరకు మారదు. కాలగతి మారదు. విధి నిర్ణయములు సర్వులకు శిరోధార్యములు. నాకు భగవంతుని పిలుపు వినిపించినది మహామంత్రీ!

తిమ్మరుసుః దైవము మిమ్ములను చల్లగా చూచుగాక! నేనేమి చేయగలను.

వీర.న.ః చేయగలిగినదంతయు మీరే!

తిమ్మరుసుః మీ అభిప్రాయమేమి?

వీ.న.ః మా తండ్రిగారి కోరికను మన్నించి తుళవల వంశపాలనము నిలబెట్టితిరి. నన్ను రాజ్యాభిషిక్తుని చేసితిరి కదా!

తిమ్మరుసుః రాజుల మనోగతము నెరవేర్చునదే మంత్రుల కర్తవ్యము.

వీ.న.ః మరి నా మనోగతములను నెరవేర్చరా?

తిమ్మరుసుః మీ అభీష్టము మేరకు సాళువ వంశీయుల అభిమానిగా నున్న సంగమవంశపు రాజులను జయించి మన రాజ్యమున చేర్చితిమి. ఉమ్మత్తూరు ఉడయర్లను అదుపు చేసితిమి. ముదిగల్లు, రాయచూరు దుర్గాలను పాలించు ఆదిల్‌షాహ ప్రభువు విజయనగరం వైపు కన్నెత్తి చూడలేడు. శివసముద్రము శ్రీరంగము కైవసమయి సామంత రాజ్యములుగా నున్నవి. ప్రస్తుతము ఈ విద్యా నగరము సరిహద్దులు కొండవీడు, ఉదయగిరులను పాలించు గజపతుల రాజ్యసరిహద్దులలో ఒరయుచున్నవి. శత్రురాజుల భయము తగ్గిపోయినది. రాజ్యమున శాంతి నెలకొనుచున్నది. పురోభివృద్ధి యుద్ధములు లేనప్పుడే సాధ్యము. ప్రస్తుత విద్యానగర సామ్రాజ్యమున అట్టి పురోగమన కార్యములు నిశ్చింతగా, వేగముగా జరుగుచున్నవి. గోవిందరాయలు నా సోదరుడు నగర రక్షణము శక్తివంతముగా చేయుచున్నాడు. ఇంక మీరు చింత పడదగు అంశము లేవియును లేవు. వేగుల వలన రాజ్యమున అంతరంగిక, బాహిర

వ్యవహారములు తెలుసుకొనుచు నేను అప్రమత్తముగా నున్నాను. మీరు త్వరగా కోలుకొనుట ఒక్కటే చాలును.

వీ.నః అది ఇక అసాధ్యం మంత్రి మహోదయా! మీరుండగా బయటి శత్రువుల భయము లేక విద్యానగర ప్రజలు నిశ్చింతగా నుండగలుగుచున్నారు. నా బాధా కారణము వేరు.

తిమ్మరుసుః రాజన్యుల భయసందేహములను తీర్చుచు నుపాయములు వెదకుట మంత్రుల విధి.

మీ మనసులోని సందేహమును నాకు వివరింపుడు.

వీ.న.ః అప్పాజీ! మీకు తెలియనిదేమున్నది? భారత యుద్ధమెందుకు జరిగినది? అన్నదమ్ముల అంతరంగిక కలహములనివార్యములు. ఇది ఈ భరతభూమి సాంప్రదాయము.

తిమ్మరుసుః రామలక్ష్మణులు ఈ భూమిలోనే పుట్టినారు.

వీ.నః ఆ రామాయణములోనే వాలి సుగ్రీవులున్నారు. సుందోపసుందులు అందరి మనసులలో నుందురు.

తిమ్మరుసుః (గంభీరముగా) ప్రభూ! మీరు చెప్పదలచినదేమి?

వీ.న.ః మా నాయనగారి ప్రాణావసాన వేళా విశేషమున మీరు చేతిలో చేయి పట్టి ఒక వాగ్దానము చేసితిరి. దానిని నెరవేర్చితిరి. అన్నమాటకు నిలచుటలో మిమ్ములను మించినవారు లేరు. అట్లే ఇప్పుడు నాకొక వాగ్దానము చేయుడు.

తిమ్మరుసుః ఏమని చేయమందురు?

వీ.న.ః మా సవతితల్లి కుమారుడయిన శ్రీకృష్ణదేవరాయలు నా తరువాత రాజు కాకూడదు. అదే నా చివరికోరిక!

తిమ్మరుసుః మరియేమి చేయమందురు?

వీ.న.ః మీ సంరక్షణలో నుండుటచేత అతనిని మేము వధించలేక పోయితిమి! ఆర్యా! ఆ పని మీరే చేయవలయును.

తిమ్మరుసుః ఇది చాలా దారుణమయిన కోరిక!

వీ.న.ః నేను మహారాజును. మీరు మహామంత్రులు.

ఇవి నా ఆఖరు క్షణములు! ఇది నా చివరి కోరిక!! ఏమందురు?

తిమ్మరుసుః రాజు కాకుండా చేసిన జాలదా? చంపవలెనా?

వీ.న.: అతడు ఉద్ధండుడు. పైగా మీకు ప్రేమపాత్రుడు. నా మరణము తరువాత అతని అభ్యుదయము అనివార్యము. అది మాకు సహింపరానిది. ఈ కోరిక తీరిన చాలును. మీదే భారము.

తిమ్మరుసు: అరచేయి అడ్డుపెట్టి సూర్యోదయమును ఎవరాపగలరు? చరిత్రగతి అప్రతిహతము. అసూయానలమునకు గురి అయి అడవులకు వెళ్ళిన శ్రీరామచంద్రుడు ఆ తరువాత చక్రవర్తి కాలేదా? తలపులు మార్చగల మానవులు తలరాతలు మార్చగలరా?

వీ.న.: మీరతనికి సాయము చేయుదురని ఈ మాటలే తెలుపుచున్నవి.

తిమ్మరుసు: మీరు చిరకాలము జీవించవలెనని నా కోరిక. ఈ కోరికను దైవము మన్నింపని యెడల ప్రజాభిప్రాయమే నా యభిప్రాయము.

వీ.న.: రాజుగా ప్రాణప్రయాణవేళ వరము యాచించుచున్నాను.

తిమ్మరుసు: ప్రభూ! నా హృదయము కోతపడుచున్నది.

వీ.న.: అతడు బ్రతికియున్న నేను అశాంతితో మరణించెదను.

తిమ్మరుసు: రాజు కాకుండా చేసెదను. ఆప్యాయముగా గూటికొచ్చివాలిన గువ్వను గొంతు నులిమి చంపలేను.

వీ.న.: (ఆలోచించి) అయినచో ఒక పని చేయుడు. "సర్వేంద్రియాణాం నయనం ప్రధానం" అంటారు. కన్నులు లేకుండా అతడు రాజ్యాధికారమును చేజిక్కించుకొనలేడు. అతని కన్నులు తీయించి నాకు సమర్పించినచో నిశ్చింతగా కన్ను మూయుదును.

తిమ్మరుసు: (ఆలోచించి) అటులనే ప్రభూ!

వీ.న.: నా కోరిక తక్షణమే తీరవలయును.

తిమ్మరుసు: చిత్తము! మీకు కృష్ణనేత్రములు సమర్పించెదను.
(ఈ మాటలు విని ఆనందము భరింపజాలక వీరనరసింహరాయలు సొమ్మసిల్లి పడిపోవును. భిషగ్వరులు పరుగున వచ్చి నాడి పట్టి చూచెదరు ఆందోళనగా) పరిస్థితి ఎట్లున్నది?

బిషక్: మరికొంతసేపటి వరకు స్పృహ రాదు.

తిమ్మరుసు: సరే మీరు వెళ్ళిపొండు.
(వైద్యులు నిష్క్రమించెదరు)

ద్వారసాలకా ఇటు రమ్ము!

(ద్వారపాలకుడు వచ్చును)

ద్వా.పా.: ఏమియాజ్ఞ ప్రభూ!

తిమ్మరుసు: నీవు పరుగున వెళ్ళి మా సోదరుడు గోవిందరాయలను వెంట పెట్టుకుని రమ్ము.

అతడు వెళ్ళును. తిమ్మరుసు ఆలోచనామూర్తియై శయ్య దగ్గర చేతులు వెనక కట్టుకుని పచార్లు చేయుచుండును. గోవిందరాయలు వచ్చి)

గో.రా.: అన్నగారూ! ఏమియాజ్ఞ!

తిమ్మరుసు: సోదరా! నీవు వెంటనే వెళ్ళి కృష్ణనేత్రములు తోడి తెమ్ము.

గో.రా.: (సందేహముతో) మీ అభిప్రాయమేమి?

తిమ్మరుసు: (రహస్యముగా) లేడికన్నులు తోడితెమ్ము! అవి కృష్ణనేత్రములు అని చెప్పుము.

గో.రా! సరియే అన్నగారూ!

(తిప్పాంబ శోకముతో ప్రవేశము)

తిప్పాంబ: అప్పాజీ! నా తనయుడు నీతో మాటాడెనా? తుది కోర్కెలు చెప్పినాడా? అయ్యయ్యో! పుత్రకా!

(అతని ముఖము చూచుచు విలపించును. తిమ్మరుసు ఆమెను అనునయించి)

తిమ్మరుసు: తుది కోర్కెలు చెప్పినారు. కృష్ణరాయల నేత్రములు తోడి.తెచ్చిన అవిచూచి ప్రాణము విడుతురట?

తిప్పాంబ: అయినచో ఆ పని త్వరగా చేయింపుడు.

తిమ్మరుసు: అందుకే గోవిందరాయలను పంపుచుంటిని. (అతని వైపునకు తిరిగి) గోవిందరాయా! నీవు వేవేగమే కృష్ణనేత్రములు తోడి తీసుకుని రమ్ము.

గో.రా: వెనువెంటనే వచ్చెదను అన్నగారూ!

(తిప్పాంబ శోకించుచుండును. అప్పాజీ అనునయించుచుండును)

గో.రా.: (తామర పత్రములో రక్తము ఓడుతున్న నేత్రములు తెచ్చి అన్నగారికి అందించును) ఇవిగో కృష్ణనేత్రములు!!

వీ.న.: (కన్నులు విప్పిచూచి) కృష్ణరాయల కన్నులు పెరికించి తెప్పించితిరా? (ఆదుర్దాగా) ఏవి? ఏవి? నాకు చూపుడు.

తిమ్మరుసు: అవును ప్రభూ! ఇవిగో కృష్ణనేత్రములు (అతనికి చూపును. అవి చూచి తుళువ వీరనరసింహుడు ప్రాణములు విడచును. తిమ్మరుసు నిట్టూర్చును. తిప్పాంబ ఘొల్లుమని విలపించుచు అతని పార్థివ శరీరము మీద పడును)

నాగాంబ: (నాగాంబ, ఓబాంబ ప్రవేశించెదరు) మహామంత్రీ! నా కుమారుని కన్నులు పెరికించినారని వింటిని! (దు:ఖముతో) ఇందులకేనా అతనిని అనేకమారులు రక్షించినది? సవతి తల్లి హత్యా ప్రయత్నముల నుండి కాపాడితిరి కదా! మరల యేమి విపరీతము జరిగినది? నా ప్రియపుత్రుని నాకప్పగించిన ఈ రాజ్యము విడచిపోవుదును. అనుగ్రహింపుడు. భర్తలేక, తనయుడు లేక అసూయలు బుసలు కొట్టు ఈ పాముల పుట్టలో నేను జీవింపజాలను.

తిమ్మరుసు: వీరనరసింహరాయలు మరణించినాడు. దేశము అనాధ కాకుండా వారసుని నిర్ణయించవలెను. ఆ నిర్ణయము జరుగునంతవరకు వారసులందరు బందీలుగా నుందురు. నీ కుమారుడు నాకడ బందీగానున్నాడు.

ఓబాంబ కుమారులయిన అచ్యుతరాయలు, రంగరాయలు కూడ బందీలయినారు. ఇది తాత్కాలికమయిన ఏర్పాటు. రాజకీయ విషయము. పెద్దలు వారసుని నిర్ణయించిన తక్షణము అందరు విడుదల అగుదురు.

ఓబాంబ: నా కుమారులిరువురిని కూడ బందీలొనర్చితిరా? (ఆందోళనగా)

తిమ్మరుసు: ఇది రాజకీయ విషయము. నీ, నా అంతరములకు తావు లేదు. ఆందోళన చెందవలసిన పనిలేదు. పట్టాభిషేకము నిర్విఘ్నముగా ముగియును. తదనంతరము అందరును వచ్చెదరు. వారసత్వము ఎవరిది? అను విషయము నిర్ణయించుటకు సామంత, దండనాయక, దుర్గాధ్యక్షులే కాక మరికొందరు పండితులు పెద్దలు ఎదురు చూచుచున్నారు. వారితో చర్చించు పని కలదు. సెలవు దయచేయుడు.

నాగాంబ: నాతనయుడు శ్రీకృష్ణదేవరాయలు అంధుడయినాడు. అతనికింక రాజ్యాధికారమునకై పోరాడు నవకాశము లేదు. వానిని నాకప్పగించిన నగరము విడిచి వెళ్ళిపోవుదుము.

తిమ్మరుసు: (మందస్మితమును దాచుకుని గంభీరముగా చూచుచు, శ్రీకృష్ణరాయలను ఎప్పుడెమి చేయవలయునో నాకు తెలియును. అతడు మాతృమూర్తిని కలియుటకు వచ్చును. అంతవరకు వేచి చూచుట మంచిది.

(ముందునకు నడచి ఆలోచనా మందిరము ప్రవేశించును. అప్పటికి రావలసినవారు అందరును వచ్చి తమలో తాము చర్చించుకొనుచుందురు. తిమ్మరుసు మహామంత్రి ప్రవేశముతో అందరు గౌరవసూచనగా లేచి నిలుచుందురు.)

తిమ్మరుసు: (నమస్కరించును.)

పండితులారా! పెద్దలారా! మంత్రి సామంత దండనాయక, దుర్గాధ్యక్ష, దళపతులారా!!

మనకు ఎదురయిన సమస్య మీకందరకు తెలిసినదే! మరణించిన మహారాజు తుళువ వీరనరసింహరాయల వారి ఆత్మశాంతికి మనమందరము కొద్ది క్షణములు లేచి నిలచి మౌనము పాటించుదము. (అందరు లేచి నిలచి విరుద్ధ మానసములతో మౌనము పాటించెదరు) ఇట్టి సమస్యలీ వరకే ఎదురయినవి. సాళువ నరసింహరాయలు రుజాగ్రస్తులై మరణించినప్పుడు సమావేశమైతిమి. మీ అభిప్రాయములకు అనుగుణముగా మహారాజ పదవికి అతని కుమారుని వారసుని జేసితిమి. వారును హత్యకు గురికాగా వారి సోదరునికి వారసత్వము కట్టబెట్టితిమి. పెద్ద కుమారుడు తిమ్మరాజు చనిన దారినే రెండవ కుమారుడు నరసింహరాయలు కూడ చనినాడు.

అంతటితో సాళువపాలనకు భరతవాక్యము పలికి తుళువ నరసరాయల పాలన వచ్చినది. అతని తరువాత అతని కుమారుడు వీరనరసింహుడు కూడ ఇప్పుడు కాలగతి చెందినారు. ఇప్పుడు వారసులెవరు? అను సమస్య మన ముందున్నది.

సామంతులు: తిరిగి సాళువ వంశీకులనే ఎన్నుకుందము. చుట్టుప్రక్కల రాజ్యములలో అధిక సంఖ్యాకులయిన సంగమ వంశీకులందరూ ఈ అభిప్రాయముతోనే ఉన్నారు.

తిమ్మరుసు: ఆనాడు అనివార్య పరిస్థితులలో ఔరసులు లేక సాళువల నుండి రాజ్యాధికారము తుళవలకు సంక్రమించినది. గత చరిత్ర కాదు. ఇప్పటి చనిపోయినవారి వారసులే రాజ్యార్హత కలవారని నా అభిప్రాయం.

రాజ్యాధికారము తిరిగి సాళువ వంశీకులకు దక్కవలెనన్నచో వారు యుద్ధము చేసి జయించవలసినదే! పండితులు ఏమందురు?

పండితులు: అదే శాస్త్ర నియమము.

పెద్దలు: రాచరికపు సాంప్రదాయములీరీతినే నడచుచున్నవి. సాళువ వారికన్నా ముందు ఈ రాజ్యాధికారము మూడవ హరిహరరాయలిది. వారి ఔరసులు వచ్చిన రాజ్యాధికారము దక్కునా? దక్కదు కదా! చనిపోయిన రాజు వారసులే రాజ్యాధికారులు.

తిమ్మరుసు: మరిప్పుడు తిప్పాంబ సుతుడు చనిపోయినాడు. ఓబాంబకు అచ్యుతరాయలు, రంగరాయలు ఇరువురు సంతానము. నాగాంబకు శ్రీ కృష్ణరాయలు ఒక్కడే సంతానము. వీరిలో ఎవరు రాజు కావలయును?

దుర్గాధ్యక్ష: ఈ విషయము మీ విచక్షణకే వదలి వేయుచున్నాము.

పండితులు: రాజకుటుంబ వ్యవహారము. అందరికన్నా మీకే బాగా తెలియును.

పెద్దలు: మరొకరు ఈ విషయములో తల దూర్చరు.

దండనాయ: సైన్యము సర్వము మీ నిర్ణయమునకు కట్టుబడి యుండును.

సామంతులు: (ముఖములు మాడ్చుకుని) మాకును మీ నిర్ణయమే శిరోధార్యము.

పెద్దలు: వారసత్వ నిర్ణయాధికారమును ఈ పారిషదులందరు ముక్త కంఠముగా మీకే అప్పగించినారు.

తిమ్మరుసు: అయినచో మీరు మంత్రాలోచనా మందిరము నుండి పేరోలగమునకు దయచేయుడు (చేతులు జోడించును)

పెద్దలు: వారసుని పేరు ప్రకటింపరా?

తిమ్మరుసు: నేరుగా పట్టాభిషేకమునే దర్శించెదరు కాక!!

(అందరు ఆసక్తితో పేరోలగమును చేరుకొనియెదరు. కొంతసేపటి తరువాత తిమ్మరుసు ఆ చోటుకు చేరుకొనును. సింహాసనము ప్రక్కన మహామంత్రి ఆసనము మీద కూర్చొనును. సభ నిశ్శబ్దము అగును)

(కళ్యాణభట్టులు వచ్చి హెచ్చరికలు చెప్పెదరు)

క.భ.: శ్రీమన్మహామండలేశ్వర, రాజమార్తాండ, తుళువంశకుల తిలక, అవక్ర విక్రమోపార్జిత అఖండభూమండలేశ్వర, భండన మార్తాండ శ్రీశ్రీశ్రీ

మన్మమహారాజ రాజ పరమేశ్వర, గండరగండ విద్యానగరధర్మ పరిపాలకులగుటకు, పట్టాభిషిక్తులగుటకు శ్రీశ్రీశ్రీ తుళువ నరసరాయ నాగాంబల నోము పంట శ్రీ కృష్ణదేవరాయల ప్రవరాన్వితులు విజయం చేస్తున్నారహో!! సభలోని వారు నిశ్శబ్దంగా ఉండాలహో!! హెచ్చరిక!! హెచ్చరిక!! (సభలోని వారందరు శ్రీ తిమ్మరుసు వారి నిర్ణయమునకు విభ్రాంతులగుదురు. గిట్టనివారు గుసగుసలు పోవుచుందురు)

(శ్రీకృష్ణదేవరాయలను సభ మధ్యలో ఉన్నతవేదికపై కూర్చుండ నియమించి నదీ తీర్థజలములతో అభిషేకించి వేదమంత్రములు చదివి ఖడ్గమును బహూకరించెదరు.

సింహాసనము మీద కూర్చుండమని కోరెదరు. శ్రీకృష్ణదేవరాయలు పెద్దలందరికీ నమస్కరించుచు సింహాసనము వైపుగా పురోగమించుచుండును. ఆ వరుసలో ఆఖరున అనగా సింహాసనము ప్రక్కనే తిమ్మరుసు మహామంత్రి కూర్చుని ఉండును.

శ్రీకృష్ణదేవరాయలు తిమ్మరుసు మహామంత్రికి పాదాభివందనము చేయును)

కృ.రాయలు: (ఆప్యాయముగా) అప్పాజీ! నన్నింతవానిని చేసిన పుణ్యము మీది. మనసార ఆశీర్వదింపుడు.

(లేచి నిలచును. అప్పాజీ అతనిని కౌగిలించుకుని ఆశీర్వదించునని అందరనుకొందురు. కాని మహామంత్రి మహారాజును చాచి చెంపమీద కొట్టును. అది చూచి అందరు దిగ్భ్రాంతి చెందెదరు. కాని శ్రీకృష్ణదేవరాయలు వినయముతో భక్తిపారవశ్యముతో చేతులు జోడించును. ఆ చెంపదెబ్బకు శ్రీ కృష్ణదేవరాయల తల తిరిగి కన్నుల వెంట నీరు కారుచుండును. అప్పుడు కన్నీరు తుడిచి అప్పాజీ అతనిని కౌగిలించుకొనును.)

తిమ్మరుసు: శ్రీకృష్ణదేవరాయా! (కన్నీరు ఉత్తరీయముతో తుడుచుచు) నీవు నీ తండ్రి తుళువ నరసరాయలకు ఎంత ప్రేమపాత్రుడవో నాకు అంతకన్నా అధికుడవు. అనుంగు శిష్యుడవు. నీకు అన్ని రాజవిద్యలు బోధించితిని!

ఈ విద్యానగర మహాసామ్రాజ్యము నీ ఏలుబడిలో విస్తరించి శాంతి సౌభాగ్యములతో రంజిల్లవలె!

ప్రజల కష్టములను రాజెరుంగవలెను. శిక్షలు విధించునప్పుడు వారి బాధెట్లుండునో పాలకునికి అర్థము కావలెను. అదియొక శాస్త్రముగా నున్నది. దానినే దండపారుష్యశాస్త్రము అనెదరు. రాజు శిక్షలు విధించును. ఎవరికెంత శిక్ష విధించవలెనో సరిగా నిర్ణయించవలెనన్న అతనికా బాధ తెలియవలెను. నీవు రాజకుటుంబమున నల్లారుముద్దుగా బెరిగితివి. నేను ఆప్యాయముగా విద్యలునేర్పితిని. నీకుసుఖములే తెలియును. పొగడ్తలు, ప్రశంసలే తెలియును. శరీరము నొచ్చుట తెలియదు. ఆ విద్య నీకిప్పుడు నేర్పించితినయ్యా! ఈ దండపారుష్య విద్యా ప్రదానముతో నాకడ నీ విద్యాభ్యాసము పూర్తిగా పూర్తి అయినది.

**పద్యము:**

**నేర్పితి సర్వశాస్త్రగతి నేర్పితి ధార్మిక పాలనావిధిన్**
**తీర్పరికాగ శిక్షితుల దీర్పులు జెప్పెడు వేళలందు నీ**
**వోర్పువహింపనెంత ఘనమో తెలియందగు గానగొట్టితిన్**
**చేర్పులు కూర్పులున్ ముగిసె చేదగు బోధకు శిష్యశేఖరా!!**

కనుక శ్రీ కృష్ణదేవరాయా! ఈ కష్టమును కన్నీటిని గుర్తుపెట్టుకొని దేశమే దేవాలయముగా, దీనజనులే నీ దేవుళ్ళుగా, వారి ఆకలి దీర్చియన్నము పెట్టుటే మహార్నివేదనముగా భావింపుమయ్యా! నాకు దేవుడు కన్నులిచ్చినందుకీనాడవి ధన్యమయినవి.

నిన్ను మణిమకుటధారిగా చూచుటయే నా జీవితలక్ష్యము. వేవేగ వెళ్ళి సింహాసన మధిష్ఠింపుము.

కృ.రాయలు: అప్పాజీ! తండ్రికన్నా మిన్నగా మీరు నన్ను సాకితిరి. అంతఃపుర కల్లోలముల నుండి నన్ను దప్పించితిరి. విషప్రయోగముల నుండి రక్షించితిరి. ప్రాణదానము జేసితిరి. నేడు మీ చతురత వలన రాజుగ పట్టాభిషిక్తుని జేసితిరి.

అలనాడు శ్రీ కృష్ణపరమాత్మ వలన అర్జునునకు ఎంతమేలు జరిగినదో ఇప్పుడు మీ వలన నాకు అంతమేలు జరిగినది. మీ అనుగ్రహము వలన కృష్ణరాయలకు చరిత్ర ఏర్పడినది. అందులకు నంజలించి సర్వదా కృతజ్ఞుతాబద్ధుడనై మెలగెదనని వాగ్దానము చేయుచున్నాను.

తిమ్మరుసు: నాయనా రాజులకుండవలసినది ఉద్యోగుల పట్ల అనుగ్రహమే కాని కృతజ్ఞత కాదయ్యా! నేను మీకు మహామంత్రిని.

కృ.రాయలు: (బాధగా) అప్పాజీ! మీరు నాకు నాన్నగారు.

తిమ్మరుసు: అది వ్యక్తిగతము. ఇది రాజరికము. దేనికదే మహనీయము. ఇక నీవు నిశ్చింతగా విద్యానగర సింహాసనమధివసింపుమయ్యా! నీ తల్లి కోరికలీనాడు ఈడేరినవి!!

కృ.రాయలు: ధన్యోస్మి అప్పాజీ! (మరొకమారు గురువు పాదాలకు నమస్కరించి వెళ్ళి సింహాసనము మీద కూర్చుండును)

మంత్రి, సామంత, దండనాయక, దుర్గాధ్యక్ష, రాజోద్యోగులారా! మాతృమూర్తులారా, పెద్దలారా, పురప్రముఖులారా! రాజుగా పట్టాభిషిక్తులమయిన తక్షణము మేమొక శాసనమును వెలువరించ దలచినాము. అదియే మా మొదటి శాసనము.

అలనాడు చంద్రగిరి సాళువ నరసింహరాయల పాలన ఆదిగా ఈనాటి నా పట్టాభిషేకము వరకు రాయర్ల చరిత్రకు సూత్రధారి సాళువ తిమ్మరాయలు, మహామంత్రి వర్యులు. వారి సహకారమే మా వంశమునకభ్యుదయము సమకూర్చినది. వారు మహామేధావి అని మాత్రమే చాలామందికి దెలియును. కాని అప్పాజీ వారు స్వయముగా కత్తిపట్టి కదనము సలుప గడు సమర్థులు. ఈ అంశము కొద్దిమందికే తెలియును. వారి మేథస్సుకు తగిన మంత్రి పదవి లభించినది. వారి పరాక్రమమునకు దగిన విధముగా నేనిప్పుడు వారిని విద్యానగర సర్వంసహా సైన్యాధ్యక్షునిగా ప్రకటించుచున్నాను. ఇదియే నా మొదటి శాసనము.

సభ: సెహబాస్! సెహబాస్!! సముచిత నిర్ణయము.

ధూర్జటి: (లేచి నిలచి) శ్రీకృష్ణదేవరాయా! ఈ శుభపట్టాభిషేకవేళ నేనొక పద్యము విన్నవించెదను.

కృ.రాయలు: అవశ్యము. కవుల నవధరింపని చెవులెందుకు? కానిండు.

ధూర్జటి:

సీసపద్యము: "ప్రణుతింపనతడు తోరణగట్టు పరసీమ
లను రీతిసూత్నతోరణములెసంగ;
"రిపుల ఖండించి సత్కృపతత్సుతుల నిల్పు
నట్లు ద్వారములందుననటులలర
"విలిఖించునతడు దిక్కులజయస్తంభాళి
ననుమాడ్కి జిత్తర్వు హర్మ్యలొప్ప
"వెలయునిట్లతని కీర్తులు దిక్తటులనన్న
సరణి ముత్తింపుముగ్గు జిగ్గులమర

గీతి: నభినవాలంకృతి మూర్తి నతిశయించె
నప్పురీరత్నమపుడు మహాద్భుతముగ
ప్రకట మహిమల శ్రీకృష్ణరాయనృపతి
శ్రీకరంబైన పట్టాభిషేకవేళ॥

కృ.రాయలు: బాగున్నది. బాగున్నది.

తిమ్మరుసు: మహాబాగు సెహబాసు

పండితులు: సాధుసాధు భళారే!!

పెద్దలు: అయ్యారే అద్భుతము. మహాద్భుతము (తెరవ్రాలును)

# తృతీయాంకము

(చిన్నాదేవి విలాసమందిరము. శోభాయమానముగా అలంకరింపబడి యుండును. చిన్నాదేవి శ్రీకృష్ణదేవరాయలకు తాంబూలమిచ్చును.)

కృ.రాయలు: చివురుమోవికి తాంబూల చికురమిచ్చి

చిన్నాదేవి: (అతని చేతికి గోరింట అద్దును)

కృ.రాయలు: శ్రీకరంబుగ గోరింట చిహ్నమలది

చిన్నాదేవి: (అతని మెడలో హారము వేయును)

కృ.రాయలు: స్వాతిముత్యాల పేరుల జక్కదిద్ది

చిన్నాదేవి: మీరు మాటాడుచున్నారా? పాట పాడుచున్నారా? దేవరా?

కృ.రాయలు: మధురభావములు మాటలైనను పాటలవలెనుండును. చూచితివా చిన్నాదేవి! ఈ మూడు పదములు పద్యముగానైనవి.

చిన్నాదేవి: మన ప్రేమ నాలుగుదిక్కుల నిండునట్లు నాలుగవ పాదము చెప్పుడు.

## పద్యము

**॥చివురు మోవికి తాంబూల చికురమిచ్చి**
**శ్రీకరంబుగ గోరింట చిహ్నమలది**
**స్వాతిముత్యాల పేరులు చక్కదిద్ది**
**కృష్ణరాయలమదిదోచె గువలయాక్షి॥**

చిన్నాదేవి: మీరు కదనరంగమార్తాండులే కాదు. కవితా ఘనతాప్రకాండులే కాదు

కృ.రాయలు: ఆగినావేమి? వర్ణింపుము చిన్నా!

చిన్నాదేవి: కుబ్జ హృదయాబ్జ భృంగము కూర్మి మిగుల॥

కృ.రాయలు: కవిత్వము బాగున్నది కాని నీవు కుబ్జవు కావు. నేను శ్రీకృష్ణుడనూ కాను. వివశురాలవై విశేషణములధికము చేసితివి.

చిన్నాదేవి : కాదు దేవరా! దేవరాయనామాంకితుడయిన శ్రీకృష్ణుడెక్కడ? సాధారణ వనిత నేనెక్కడ? ప్రాణములను లెక్కచేయక మీరు నిగూఢముగ నాయింటికి

వచ్చుటేమి? అంతఃపుర కల్లోలములున్నవి. శత్రుమూకల చెరలాటలున్నవి. ఎంత ప్రమాదము?

మీ రాచరికము శ్రీకృష్ణ వైభవము. మహనీయతలో పోల్చి చూచిన ఈ చిన్నాదేవి కుబ్జ కాక మరేమగును.

కృ.రాయలుః ఈ కృష్ణదేవరాయల దేవేరియగును. (నవ్వును)

చిన్నాదేవిః అది సాధ్యమా? ఈ స్వార్థపూరిత సమాజము పెట్టుకున్న నీతులు, రీతులు హృదయమున్నవారికి కంటకములు.

కృ.రాయలుః సమాజము అంతటిని ఆడిపోయకు చిన్నా! సమాజమే నా దేవాలయము. దీనజనులే నా దైవములు. సమాజమున పెద్దవారు కొందరే యుందురు. ఒక్కొక్కసారి వారి యాటలు సాగును. మాటలు నెగ్గును. అంతమాత్రమున సమాజమంతటినిదూసి పోయుట యుచితము కాదు. ధీరులు అడ్డంకుల నధిగమింపగలరు. ఎన్ని అడ్డంకులెదురైనను నేను నిన్నే దేవేరిని చేసుకొందును! ఇది నా వాగ్దానము. స్వీకరింపుము. (చేతిలో చేయివేయును. చిన్నాదేవి యానందబాష్పములను పయ్యెద పటలమున అద్దుకొనును)

చిన్నాదేవి : ధన్యురాలను! జీవితము అందమయిన పుష్పము. ప్రేమసుగంధ సంభరితము. మగువల జీవితములు మరింత మనోహరములు. భావుకతా పరిమళ పరిపూరితములు. ఆజీవము, అహర్నిశము ఈ కృష్ణదేవుని కొలువున్న చాలు! నా జీవితము ధన్యమగును. కుబ్జకు మోక్షమిచ్చిన ఆ కృష్ణుడు ఈ కృష్ణుడని యారాధింతును. (ఆలకించి ఆందోళనగా) వెలుపలనేదో అలజడి చెలరేగినది. (తిమ్మరుసు మహామంత్రి రక్తసిక్తమయిన ఖడ్గము ధరించి లోపలకు వచ్చును. ఆందోళనగా)

తిమ్మరుసు : శ్రీకృష్ణదేవరాయ ప్రభూ! మీరెంత పరాకుపడితిరి? క్షణములో ప్రాణగండము తప్పినది. మీరు నావెంట రండు. (సంరంభముగా కత్తి దూసి కృష్ణదేవరాయలు అప్పాజీ వెంట నడుచును. వారు సైనికులు పరివేష్టించగా వీధుల వెంట నడచి శ్రీకృష్ణదేవరాయల మందిరమునకు వచ్చెదరు.)

తిమ్మరుసు : ప్రభూ! మీరు పొరపడితిరి! మీరిప్పుడు మణిమకుటధారులయిన మహారాజులు! ఇదివరకటి వలె విద్యార్థులు కారు. యువరాజులు కారు. శత్రుగూఢచారుల చాలనము అధికముగా నున్న ఇట్టి సమయమున మీరు

ఇట్లు అంగరక్షకులు లేకుండా వెళ్ళుట ఎంతయో ప్రమాదకరము. సరి అయిన సమయమున కనుగలిగి సమాచారము అందుకొంటిని. లేకున్న శత్రువుల దాడి మీకు ఎదురయ్యేడిది.

కృ.రాయలు: అయిననేమి వారిని చీల్చి చెండాడెదనుగాక! (భుజస్ఫాలన చేసి) ఈ ఖడ్గ ప్రహారములతో వారి శిరస్సులను భూమిపై కందుకముల వలె దొర్లింపనా? శత్రు శరీర నిర్మథనమై ఈ ఖడ్గము రక్తాంచితమై తరళాయితము కాదా?

తిమ్మరుసు: అందుకు సమయమున్నది. సైనికులున్నారు. ధర్మదండము స్వీకరించిన తరువాత మీరిట్టి పనులు చేయరాదు. మీకు వచ్చిన యాపద యావత్తు విద్యానగర సామ్రాజ్యమునకు వచ్చిన యాపదయగునని గుర్తుంచుకొనుడు ప్రభూ! ఇంకను ఈ బాల్య చాపల్యములు విచేష్టితములు ఎందుకు?

కృ.రాయలు: ఇవి బాల్యవిచేష్టితములు (నవ్వి) కావు అప్పాజీ?

తిమ్మరుసు: మరేమందురు?

కృ.రాయలు: యౌవనోదయ రాగవిశేష విలక్షణోపలక్షితములు

తిమ్మరుసు: నేనే పొరపడితిని (చేతులు కట్టుకొని గంభీరముగా ఆలోచించుచు పచారులు చేయును. అప్పటికాయన ముఖములో మహాసముద్రములు గోచరించును) నీవు చెప్పినది నిజమే! కాని ప్రాణాంతకమయిన పనులేల?

కృ.రాయలు: ఈ శ్రీకృష్ణుని సర్వవేళల కాపాడు దేవుడొకడున్నారు. ఆ దేవుని పేరు అప్పాజీ!

తిమ్మరుసు: ఈ పొగడ్తలతోనే నా మనసును కట్టిపడవేసితిరి మహారాజా! కాని రక్షణ విషయములో నేనెట్టి ప్రలోభములకు మాయ మంత్రములకు వశుడను కాను. పరాకు ప్రభుత్వములో పాలకులకు పనికిరాదు. మన పరాకు ఒకదేశ ప్రతిష్టను, ఒక వంశ ప్రతిష్టను, దెబ్బతీయును. కనుక ఈ విషయములో కఠినముగా వ్యవహరింపదలచితిని. మహారాజా! మీకు వివాహము జేయ సంకల్పించితిని.

కృ.రాయలు: మేము చిన్నాదేవిని వివాహమాడుదుము మంత్రివర్యా!

తిమ్మరుసు: అదెట్లు పొసగును? ఎందరో రాజన్యులు తమ కుమార్తెలను మీకిచ్చి బంధుత్వము కలుపుకొనవలయునని ఉవ్విళ్ళూరుచున్నారు. రాజుల వియ్యములు, నెయ్యములు, కయ్యములు అన్నియు రాజకీయ ప్రయోజనములను ఆశించి మాత్రమే జేయవలెను. ఇది రాజనీతియని కౌటిల్యుడు అర్థశాస్త్రమున చెప్పినాడు.

## పద్యము

**సర్వము రాజకీయమగు సాత్రపపాళికి గుర్తెరుంగుమీ**
**యుర్వినిదుర్వి దగ్ధమగు నుజ్వల శాత్రవదుష్ట నీతికిన్**
**పర్వగ నెయ్యమున్ గలహ బాంధవముల్ తగురాజనీతిగా**
**ధూర్వహమైన నీ వసువధూటి రమింపుము బుద్ధిశాలివై॥**

కృ.రాయలు: అప్పాజీ! మీ మాటలను సర్వదేవతాశీర్వచనముగా భావించి గౌరవింతును. కాని చిన్నాదేవిని వివాహమాడుదునని వాగ్దానము చేసితిని! ఇచ్చిన వాగ్దానమునకు విఘ్నము రాకుండ పాడియగు మార్గము ప్రబోధింపుడు.

తిమ్మరుసు : అట్లే చేయుదును. మీరు అంగరక్షకజన పరిరక్షితులై నగరికి దయచేయుడు. విషయ విచారణ నాకు విడిచిపెట్టుడు. మరెప్పుడను ప్రాణగొడ్డములైన సాహసముల జేయపనిలేదు. (శ్రీకృష్ణదేవరాయలు అప్పాజీకి నమస్కరించును. అంగరక్షకులు చుట్టు నిలిచి రక్షణ అందించగా వెళ్ళిపోవును. తిమ్మరుసు మహామంత్రి కొంత తడవు ఆలోచించును. ఒక నిర్ణయమునకు వచ్చినట్లుగా ముడివడిన కనుబొమలు విడివడజేయును. పిడికిళ్ళు బిగించి పట్టుదలను దాల్చినట్లు కన్పించును. ఆ యెడ సిద్ధముగానున్న వేగు ఒకరు లోనికి వచ్చి నమస్కరించి నిలచును.)

నీవు తక్షణమే మన అతిథిగా నున్న శ్రీరంగపాలకులు వీరశ్యామ దేవరాయల వారి నిచ్చటకు పిలుచుకొని రమ్ము.

వేగు : చిత్తము ప్రభూ! (వెళ్ళును)

తిమ్మరుసు : (వాకిలివైపు చూచి) ద్వారపాలకా! నీవు వేగవెళ్ళి తుళువ నరసరాయల ధర్మపత్ని , శ్రీకృష్ణరాయల రాజమాత అయిన నాగాంబా దేవేరివారిని ఈ మంత్రాలోచన మందిరమునకు విజయము చేయుమని మా మాటగా విన్నవింపుము.

ద్వా.పా.: అవశ్యము (వెళ్ళును)

(తిమ్మరుసు యోచనాముద్ర వహించును. కొంత తడవున ద్వారపాలకుడు ప్రవేశించి)

ద్వా.పా: ప్రభూ ! శ్రీరంగ సామంత మహీమండలాధిపులు శ్రీ వీరశ్యామ దేవరాయల వారు విజయం చేయుచున్నారు.

తిమ్మరుసు : సగౌరవముగ దోడ్కొని రమ్ము.

(ద్వారపాలకుడు వెళ్ళును. పరివారజనులు దారిచూపగా ఘనమయిన రీతిలో శ్రీరంగశ్యామ దేవరాయలవారు ప్రవేశింతురు. తిమ్మరుసు ఉచితాసనమిచ్చి గౌరవించును. తానును కూర్చొనును)

శ్యామ : రా : మంత్రిమహోదయులు వర్తమానము నంపిన కారణమేమి?

తిమ్మరుసు : విద్యానగర మహాప్రభువు శ్రీకృష్ణదేవరాయలవారు యుక్తవయః పరిపాకము నందియున్నారు. యుక్తమగు శుభ పరంపరలు రానున్నవి.

శ్యామ. రా : శుభమస్తు! వారికి మా కుమారి తిరుమలదేవిని దేవేరిని చేయవలయుననీ సంకల్పము మాకు కలిగినది. ఈ విషయము గతములో మీకు తెలియపరచి యుంటిమి. తగు సమయము వచ్చువరకు వేచియుండమని మీరప్పుడు నుడివితిరి. కాలోచితమయిన యాలోచనలు సేయుట, సమయోచితమగు నిర్ణయములు చేయుట ఉచితానుచితము లెరిగిన తమవంటి పెద్దలకుచితమై యొప్పినవి. ముహూర్తములు నిర్ణయింతుమా మంత్రి మహోదయా!

తిమ్మరుసు : ఆడుబిడ్డ గలవారు ఆతృతపడుట సహజమే! కాని ఈ విషయమై రాజమాత యభిప్రాయము తెలుసుకొనదగును.

శ్యామ.రా: ఉభయులకు మీరు శ్రేయఃకాములు. మీయభిప్రాయమే మాయభిప్రాయము. మీరు సర్వమును నిర్వహింపగల ప్రజ్ఞాధురీణులు. మీకు తెలియనిదేమున్నది. ఆడుబిడ్డలు కలిగినప్పుడు తల్లిదండ్రులు సంతోషింతురు. అల్లారుముద్దుగా నెత్తి పెంచుదురు. వారికి మంచి భర్త లభింపవలయునని మనసార గోరుకొందురు. ఇది లోక సహజము. ఆడుబిడ్డను తల్లిదండ్రులు కాలు తడవకుండ కడలినైనా దాటింతురు కాని కన్ను తడవకుండ గడప దాటింపలేరు కదా!

తిమ్మరుసు : ఉచితముగా లోకరీతిని నిర్వచించితిరి ఆర్యా!

(ద్వారపాలకుడు ప్రవేశించును)

ద్వా.పా.: రాజమాత నాగాంబ వారు విజయము చేసిరి. పటల అభ్యంతరమునకు ఆవల ఆశీనులైయున్నారు.

నాగాంబ : (తెర చాటునుండి కంఠస్వరము వినిపించును)

ఆర్యులందరికి అభివందనములు.

తిమ్మరుసు : రాజమాతా! శ్రీరంగము బాలించు శ్యామదేవరాయలవారి పుత్రికా శిరోరత్నము తిరుమలదేవి. ఆ కన్యకామణిని మన విద్యానగర ప్రభువులు శ్రీకృష్ణ దేవరాయలకిచ్చి వివాహము జరిపించవలయునని వారి ప్రతిపాదన. మీరిచ్చు సమాధానమేమి?

నాగాంబ : (కంఠస్వరము గద్గదికము కాగా) మీకన్న నెక్కువ నాకు తెలియునా తిమ్మరుసు మహామంత్రి! ఆతనిని కన్నదే శాపముగా నసూయలకు గురి అయితిని. ఇంతకాలము నా మాతృహృదయమాతని క్షేమవార్తకై ఎంత దురపిల్లినదో మీరెరుగుదురు. ఒకటననేమి, రెండననేమి ప్రతి క్షణమొక యుపద్రవముగా నింతకాలము జరిగినది. తండ్రిలేని బిడ్డ నా శ్రీకృష్ణుడు నేనుండి లేనిదాననే! మీరు అతనికి గురువులు, తల్లిదండ్రులు, దైవము అన్నియు మీరే ఎన్నియో కడగండ్లు గట్టెక్కించితిరి. తండ్రిలేని లోటు కానరాకుండా కన్నులలో పెట్టుకుని కాచితిరి. ఈనాటికతని యభ్యుదయమును మనమెల్లరము చూడగలిగితిమి. అన్నింట మీదే భారము. ఆనాడు కుంతీదేవి మొర శ్రీకృష్ణపరమాత్ముడు వినినాడు.

ఈనాడు నేను నా బిడ్డ క్షేమమునకై మీతో మొరపెట్టుకొనుచుంటిని. అతనిని చల్లగానుండునట్లు కాపాడుకొనుడు.

మిగిలినవన్నియు మీ నిర్ణయములే కొనసాగగలవు.

తిమ్మరుసు : మీకు కానున్న కోడలు బహు వినయశీలి, విద్యావతి! గుణవతి. శ్రీరంగేశుని పట్టణమున నామె లక్ష్మీదేవి యవతారమేనని ప్రజలందరు చెప్పుకొనుచున్నారు. అట్టి సౌభాగ్యవల్లి యా యమ! మీరామెను చూడగోరిన యెడల ఒక సమావేశము నేర్పాటు జేయింతును. మీ యభిప్రాయమేమి?

నాగాంబ : మీరు వివరించినదే చాలును. నా శ్రీకృష్ణునికి అట్టి లక్ష్మియే గావలయును. నా బిడ్డ కడు అమాయకుడు. అతనినను రాగించుటకు, నాప్యాయించుటకు మీకున్నంత యోరిమి కావలెను. శ్రీకృష్ణుడు చిలిపివాడు. సముదాయించుకొను సహనము కావలెను. అట్టి రీతులామెకున్నవని మీరన్నదే చాలును.

శ్యామ. రా.: అంతియే కాదు సోదరీమణీ! శ్రీకృష్ణదేవరాయల దేవేరియగుటయే నా జీవిత తాత్పర్యము అని పట్టు బిగించి కూర్చున్నది! మరొక్కరిని వివాహమాడదట! వరుడు శ్రీకృష్ణదేవరాయలు కాకున్న వివాహమేవలదట! భీష్మించినది.

మీ ఆశీస్సులే అర్థించుచున్నాము.

నాగాంబ : నాకృష్ణుడామెకు అంత ఇష్టుడే అయినచో శుభస్య శీఘ్రం.

తిమ్మరుసు : గ్రహించితిని రాజమాతా! పండితులను బిలిపించి సుముహూర్తములు బెట్టింతును. శ్యామదేవరాయా! తగు ఏర్పాట్లలో నుండుడు.

శ్యామ. రా : ధన్యులము! ఇక వెళ్ళివచ్చెదము

(గంభీరముగా నడచుచు వెళ్ళును. తిమ్మరుసు గౌరవముగా లేచి నిలచును. వెంట నడచి వెళ్ళిన తరువాత తిరిగి వచ్చి కూర్చుండును)

తిమ్మరుసు : రాజమాతా! ఇది కాక మీకు మరొక్క విషయమును గూడ మనవి చేయవలయును.

నాగాంబ : బిడ్డ మనను తల్లికి తెలియనిది కాదు మహామంత్రి! మీరిప్పుడు చెప్పదలచినదేమో నాకు తెలియును.

కనిపెంచిన తల్లులకు పుత్రుల మానసములు కరతలామలకములు కాక యుండునా!

చిన్నాదేవి యందాతడనురాగబద్ధుడయినాడు.

**పద్యము**

**క్షేత్రము బీజమున్ గలుగజేయు ఫలంబులు బిడ్డలేగదా!**
**నేత్రములుంచి కాచుకొను నేర్పు తనంతట వచ్చు వింతగా**
**గాత్రము కల్గునాడె భువికామినులందున మూరు రాయడే**
**రాత్రి బవళ్ళు చిన్నమనరాగముముండుట నేనెరుంగుదున్.**

మాతృవాత్సల్యము వలన ఆతనిని మందలించుటకు మనసు రాకపోయినది. మేము గుత్తి దుర్గములో నున్నప్పటినుండి శ్రీ తుళువ నరవరాయలతో మీకు గల మైత్రి అపూర్వము. అట్టి యభిమానముతోనే ఇంత దనుక మీరు శ్రీకృష్ణుని యోగక్షేమములు చూచుకొంటిరి. ఎన్నో ప్రాణగండములను దప్పించి సింహాసనము మీద నిలిపితిరి! ఇప్పుడీ వంశ ప్రతిష్ఠను, ప్రభుత్వ గౌరవమును కాపాడుమని వేడుకొనుచున్నాను.

తిమ్మరుసు : అర్హతలు విచారింపక అంతఃపురవాసము పట్టపురాణి పదవి చిన్నాదేవికెట్లు కల్పింపగలము?

నాగాంబ : అట్లని కృష్ణుని మనసు నొప్పింపలేము కదా!

తిమ్మరుసు : తన రాణిగా అంతఃపురమున చేర్చెదనని చిన్నాదేవికి ప్రభువు వాగ్దానము ఇచ్చినారు. వారి వాగ్దానము నిలుపుదునని వారికి నేను వాగ్దానమిచ్చినాను. లేకున్న ప్రాణములకు తెగించుటయేగాక, రాజ్య త్యాగమునకు సైతము అతడు సమకట్టియున్నాడు. నిజమే కదా! మహానీయులయిన వారు మాట మీద నిలచియుందురు.

**పద్యము**

**ప్రారంభించిన పాలనా విధులకున్ బ్రత్యూహముల్సేసి చి**
**న్నా రాజేంద్రుని శాబ్ది గోరదను దానంబిచ్చె; వాగ్బంగముల్**
**కారాదయ్యదియన్నృతాఘమగు; సాకారంబునొందింపగా**
**ధీరాఖ్యుండను పేరుగాంచుము భువిన్ ధీశ్రేణి మెప్పింపంగా**

శ్రీకృష్ణుడు చేసిన శపథములను నెరవేర్చునని నలుగురు మెచ్చుకొనుటే మనకు చాలు. వారి వాగ్దానము నిల్పుట మన విధియగును. అందుకు నేనొక యుపాయమాలోచించితిని. చిన్నాదేవి ఇచ్చటనే యున్నచో వివాహసమయమునకు కృష్ణరాయలవారు ఏదో ఒక నెపమున నామె మందిరమునకు జేరుదురు. పదుగురి దృష్టిలోనిది చులకనయగును. ఇపుడే ఆమెను మనకు ఎంతో విశ్వాసపాత్రుడయిన అధ్యక్షుని పాలనలో ఉన్న ఉమ్మత్తూరు ఉడయరు దగ్గరకు పంపెదను. తిరుమలదేవితో రాయల వివాహము, పట్టమహిషీ పదవీ ప్రదానము నిరాటంకముగా జరుగును. అప్పుడు చిన్నాదేవిని ఉడయరువారి రాజబంధువుగా రప్పించుదము. ఆడంబరముగా అందరి సమక్షమున రెండవ వివాహము చేయించుదము. అంతటితో ఆమెను వివాహమాడి తీరవలయునన్న అతని కోరిక తీరును. వంశ ప్రతిష్ట నిలుపవలెనన్న మన కోరికయుదీరును.

నాగాంబ : మీరొక ఆలోచనము చేసిన దానికెదురేమున్నది? బహు చక్కగా నుభయతారకముగా సమస్యను బరిష్కరించితిరి. ఇట్టి మేధాసంపదలో మీకు మీరే సాటి? తుళువ వంశీయులందరు సాళువ తిమ్మరాయల

రాజభక్తిని మేదాసంపత్తిని చిరకాలము స్మరించుదురు గాక ! మరి నాకు సెలవు ప్రసాదించుడు.

తిమ్మరుసు : ఇక శ్రీకృష్ణరాయల వివాహములకు ఏర్పాట్లు చూడవలెను.

(నిష్క్రమించును) (తెరవ్రాలును)

# విష్కంభము

(తుంగభద్రానది. పడవగట్టున నిలిపి యుండును. పడవ సరంగు బేరములకై ఎదురు చూచును. ఒక అశ్వికుడు వచ్చి అతని ఎదుట గుఱ్ఱము దిగును.)

అశ్వి : నన్ను నా గుఱ్ఱమును నది దాటించెదవా !

సరంగు : అవశ్యము. దయచేయుడు.

(గుఱ్ఱమును పడవమీదికి నడిపి తానును గూర్చుండును. సరంగు పడవను ఆవలి తీరమునకు నడుపుట ప్రారంభించును. అశ్వికుని ముఖములోనికి చూచును. ఆయాసము తెలియకుండా దారి గడచుటకు మాటలు ప్రారంభించును)

సరంగు : మీరు సైనికులా ?

అశ్విక : అవును, ఇంతకాలము కొండవీడు దుర్గములో పనిచేసితిని. విద్యానగర ప్రభువు వద్ద పనిచేయు తలంపుతో తరలి వచ్చుచున్నాను. ప్రభువులు గజపతుల రాజ్యమయిన ఉత్కళము మీదికి దండెత్తి పోవుచున్నారట కదా!

సరంగు : అవును. ఉత్కళ ప్రభువును జయించి ఆయన కుమారి తుక్కాంబను వివాహమాడవలెనట !

అశ్విక : కటకం ప్రభువు ప్రతాపరుద్ర గజపతి కుమారి పేరు అన్నపూర్ణాదేవి అని వింటిని.

సరంగు : అవును ఆమెను తుక్కాంబ, అన్నపూర్ణాదేవి అని పిలుచుదురు.

అశ్విక : ఆమెను పెండ్లాడుటకు దక్షిణ పథమునే దడదడలాడించు పెద్ద సాహస దండయాత్ర చేయవలెనా?

సరంగు : దక్షిణాపథమంతయు రాయర్లదే ! ఒక విద్యానగర కోటలోని మూలబలమే

ఎనిమిది లక్షలు దాటినది. ఇక సాళువ తిమ్మరాజు మహామంత్రి నేతృత్వములో శ్రీకృష్ణ దేవరాయలు అజేయుడు ! ఇంతకు మునుపే రెండు వివాహములయినవి. మూడవ వివాహమునకు బయలుదేరుచున్నారు. నీవనినట్లు కేవలము వివాహము కొరకు మాత్రమే అయిన ఇంత పెద్ద దండయాత్ర చేయనక్కరలేదు. కయ్యముతోనే కాక నెయ్యముతో కూడ వియ్యము సాధ్యమే !

అశ్వి : మరి అట్లు చేయక ఈ యుద్ధమెందుకు సంకల్పించినట్లు?

సరంగు (తెడ్డు గట్టిగా వేయుచు పడవ వేగము పెంచును) అందుకు రెండు కారణములున్నవి. శ్రీకృష్ణదేవరాయల విషయమై కటకం గజపతి దాసీపుత్రుడని చులకనగా మాట్లాడినాడట. రెండవది ఒక దుఃఖపూరితమయిన కథ.

అశ్వి : అటులనా? ఆ కథ ఏమో నాకు తెలుపుము.

సరంగు హేమసుందరి కథ విని కన్నీరు పెట్టని వారుండరు. శ్రీకృష్ణదేవరాయలు పుట్టకమునుపే తుళువ నరసరాయలు గుత్తి దుర్గ అధ్యక్షుడుగా ఉండిన రోజులలో ఆయనకు ఒక కుమార్తె గలదు. ఆమె పేరు హేమసుందరి. గజపతులు ఆ రోజులలో కటకం దుర్గాన్ని జయించిరి. హేమసుందరి సౌందర్యం గూర్చి వినిన గజపతి వియ్యానికి రాకుండా దండెత్తి కయ్యంతో ఆమెను స్వాధీనపరచు కున్నాడు. గజపతి ఆధీనురాలయినను అతనిని వివాహము చేసుకొనుటకు ఆమె తిరస్కరించినది. అతడు కోపించినాడు. వీధులు ఊడ్చే వానికిచ్చి పెళ్ళి చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు. ఆ తరువాత పూరి జగన్నాధ స్వామి రథోత్సవంలో తాను స్వయంగా చీపురు పట్టి ఆలయం ఊడ్చాడు. అపుడే ఆమెను బలవంతముగా వివాహము చేసుకున్నాడు ఆ వయోవృద్ధుని సహజీవనం ఊహించలేక ఆమె ఆత్మార్పణ చేసుకుంది. తన సోదరి మరణానికి కృష్ణరాయలు ప్రతీకారం తీర్చదలచారు. ఇది రెండవ కారణం. కనుక గజపతుల మీద యుద్ధం జరిగి తీరుతుంది.

అశ్వి : ఇప్పుడు వీరులకు సైన్యంలో ఉద్యోగమిస్తున్నారని తెలిసే వచ్చాను.

సరంగు : పడవ తీరం చేరింది బాబూ !

(డబ్బు చెల్లించి అశ్వికుడు గుర్రాన్ని దింపుకుని వేగంగా విద్యానగరం వైపు దౌడు తీయిస్తాడు)

(తెర వ్రాలును)

# చతుర్ధాంకము

## మొదటి రంగము

సైనికులు : **కొండవీడు మనదేరా**

**కొండపల్లి మనదేరా**

**కాదని ఎవరైనా అన్నారా**

**కటకం దాకా మనదేరా ॥**

(కదం త్రొక్కుతూ పదం పాడుతూ సేనలు ముందుకు కదలిపోతూ ఉంటాయి. ముందు సైనికులు, వెనుక అశ్వికులు, ఆ వెనుక గజబలము, ఆఖరున రథాలు వెడుతూ ఉంటాయి.)

తిమ్మరుసు : శ్రీకృష్ణదేవరాయా ! మనము కొండవీడును సమీపించుచున్నాము. ఇంతవరకు మనకు స్థలదుర్గ, జలదుర్గము లేవియు ఎదురొడ్డి నిలువలేకపోయినవి. మనమిప్పుడు మూడు ప్రధాన యుద్ధములు చేయనున్నాము. కొండవీడు అద్భుతమయిన గిరి దుర్గము. మూడామడ వ్యాపించిన విస్తారమయిన కొండలు ఎత్తయినవి. విశాలమయినవి. అందువలన ఈ గిరి దుర్గమునకు లగ్గలు పట్టించుట కష్టసాధ్యమయిన యంశము. కొండపల్లి, అద్దంకి, వినుకొండ, బెల్లంకొండ, నాగార్జునకొండ, కేతవరం, రాజమహేంద్రవరం మొదలయిన దుర్గాలన్నింటిని పూర్తిగా స్వాధీనమయిన తరువాత మనం గజపతులు పాలించు ఉత్కళ సామ్రాజ్యము మీదికి పోగలము. కటకమును చుట్టుముట్టిన తరువాత మనకు వెనుకనుంచి శత్రుభయం ఉండకూడదు. ఆ కారణముగా ఉదయగిరి, కొండవీడు మనకు ప్రముఖ స్థావరములు కావలసియున్నది. కొండవీటియందు ప్రస్తుతము కటకము ప్రతాపరుద్ర గజపతి కుమారుడయిన వీరభద్ర పాత్రుడు పాలించుచున్నాడు. ఉదయగిరి యందు ప్రతాపరుద్రుని పినతండ్రిగారయిన తిరుమల కాంత గజపతి పాలించుచున్నాడు. గోదావరి నది దాటుటకు ముందుగా మనము చేయదగు ప్రధాన యుద్ధములు కూడ గజపతులతోనే !

శ్రీ.దే. : అన్నింటికి మీరున్నారు కద అప్పాజీ !

తిమ్మరుసు : నా సంగతి అట్లుంచి మీరు కృష్ణానది ఒడ్డున రెండు లక్షలపై సైన్యముతో విడిది చేయుడు. ఆవలి తీరమునుండి శత్రువులు రాకుండ కాపు కాచిన చాలును. నేను గోవిందరాయలు కలిసి కొండవీటిని ముట్టడించెదము. ముందు లగ్గలు పట్టించి కూర్చుండును సైనికులు ప్రయాణ శ్రమనుంచి విశ్రాంతి పొందుదురు. అతడెంత కాలము బయటి సంబంధము లేకుండా నీరు, ఆహారము లందించగలడో చూచెదము గాక!

కృ.రాయలు : అటులనే! నా సైన్యము కృష్ణాతీరమందు కాపు కాయును. నేను శ్రీ అమర లింగేశ్వరుని అర్చించెదను.

తిమ్మరుసు : మనమీచోటును విడిచిపోవలయును ఎవరిదారిన వారు చేరవలసిన గమ్యస్థానములను జేరుదము మీరు తగిన విధముగా జాగరూకతతో నుండుడు. ఎప్పటికప్పుడు వర్తమానములు పంపుకొనుచుందము. ఈ యుద్ధములన్నియు ముగియుటకు నెన్ని సంవత్సరముల కాలము పట్టునో! కటకమును జయించిన తరువాత మహానదికి దక్షిణ ప్రాంతమంతయు మీ యేలుబడి క్రిందికి వచ్చును రాజ్యమునకు మూడు సముద్రములే సరిహద్దులగును. కాని కార్యమును దీక్షతో నిర్వహించవలెను. దైవము తోడ్పాటు నీయవలయును మహాకార్యములు సాధించినవారు మహా పురుషులగుదురు. సాధించుట సులభము కాదు. రాచరికపు పాలనతో ప్రజలకు శాంతిని సమకూర్చుటకు రాజులనివార్యముగా యుద్ధములు చేయవలయును. లేకున్న దుష్టశక్తులు బలమును పొంది లోకమున ధర్మమును పాడుజేయును. శ్రీకృష్ణుడు కురుక్షేత్రము నడిపించినది ధర్మ సంస్థాపనకే! ధర్మహాని లేకుండుటకే యుద్ధములు చేయుదురు.

**పద్యము**

**(మత్తకోకిలము): క్షాత్రమాకురు భూమి శౌరి వికాస భాసురి కర్గమై**

**శత్రువాహిని ఘోర విహ్వాల సంకటంబుల బర్వగా**

**గాత్రసంజనితంబులై భువిగారె శోణితవాహినుల్**

**సాత్రపాన్వయులందు యుద్ధమె సార్థకంబు నరాధిపా !!**

కావున దండయాత్రకు దక్షిణాపథమున యుద్ధజ్వరముతో నలుగుచున్న

చిన్న చిన్న రాజ్యంబులను ఏకముగా జేయుట మా ధర్మము. యుద్ధము ద్వారా అఖండ విద్యానగర సామ్రాజ్య స్థాపన శాంతి సాధన మార్గమే అగును. కనుక నరాధిపా! నీవేకాగ్రచిత్తుడవై విజయలక్ష్మీ కరగ్రహణమే లక్ష్యముగా పయనింపుము.

కృ.రాయలు : గురుదేవులగు మీ యాదేశమును తలదాల్చుటయే నా విధి! ఆనాడు వయోభేదము జూడక నా సహోదరి హేమసుందరిని బలిగొన్న ఉత్కళ గజపతులను జయింతును. వారి కుమారిని కరగ్రహణము చేయువరకు నిద్రింపను. అక్కగారికి జరిగిన అన్యాయమునకు బదులిచ్చుటయే నా జీవితాదర్శము. తిప్పాంబతో పాచికలాడుచూ ఒకనాడు నా తల్లిని చతురోక్తిగా నొడ్డి యోడిపోయెను నా తండ్రి. అంతమాత్రమునకు నన్ను దాసీపుత్రుడని నిందించిన ఆ ప్రతాపరుద్ర గజపతిని నాపాద పంకేరుహమ్ముల మ్రోల వ్రాలింతును. నా ప్రతాపాగ్ని ఛటచ్ఛటలలో నాతని అభిజాత్యహం కారమును భస్మీభూతము గావింతును. ఇదే నా ప్రతిజ్ఞ ! అప్పాజీ ! ఇక ఇదే నా జీవితాదర్శము.

తిమ్మరుసు : తథాస్తు కుమారా ! సర్వత్ర విజయోస్తు !

(వారు విడిపోవుదురు. శ్రీకృష్ణ దేవరాయలు రెండు లక్షల సైన్యమును వెంట నిడుకొని అమరావతి కృష్ణా తీరము వైపుగా సాగును. సర్వసేనానిగా తిమ్మరుసు మహామంత్రి సైన్యమును గొండవీడు వైపుగా నడిపించును. సైనికులు కోలాహలముగా నన్నివైపుల నించి కొండవీడును ముట్టడించుట ప్రారంభింతురు. దళపతులందరిని తన సముఖమునకు బిలచును. వారు మహామంత్రియు, సర్వసేనానిగా నియమితులు గాబడిన సర్వం సహాధికారి తిమ్మరుసు వారి సముఖమున ప్రాంతీయ దుర్గాధ్యక్షులు, దళపతులు చేతులు కట్టి నిలుచుదురు. వారిలో కొంకణ, కర్నాటక ప్రాంతముల సామంతులు, ఉమ్మత్తూరు, శివసముద్రము, శ్రీరంగ, తిరుచినాపల్లి ప్రాంతముల నాయకులు ఉందురు. వారు కాక ప్రాంతీయ వీరులు కొండవీడు, కొండపల్లి, వినుకొండ, బెల్లంకొండ, తంగెడకొండ, నాగార్జున కొండ, కేతవరం, అద్దంకి, ఉదయగిరీయులయిన వీరులుందురు. మహాసేనాని తిమ్మరుసు వాక్యములు వారికిప్పుడు శిరోధార్యములు. ఆ మాటల కొరకు నిశ్శబ్దముగా ఎదురుచూచుచుందురు.)

తిమ్మరుసు : వీర శిఖామణులార! మనమిప్పుడు కొండవీటికి లగ్గలు పట్టించవలెను. లగ్గలు పట్టించుట యుద్ధరీతులలో బహు మేలైనది. కొండవీడు గిరి దుర్గము ఉన్నతమయినది. సుదీర్ఘమయినది. బహు సురక్షితము. శత్రు దుస్సాధక దుర్గము. దాని చుట్టును మన సేనలు ముట్టడింపవలయును. యుద్ధము చేయబనికాదు. క్రిందివారికి, కొండపైన కోటలో నున్నవారికి సంబంధములు, రాకపోకలు నిలువరించిన జాలును. జననష్టము లేకుండా ఎక్కువ రక్తపాతము జరుగకుండా యుద్ధ విజయము సాధింపవచ్చును. పై వారికి ఆహారము కొరత ఏర్పడును. నీటికి కటకటయగును. నిత్యావసరములు, ఆయుధ సామగ్రులే కాక మిత్ర బాంధవశ్రేణుల నుండి ధన సహాయము, ఆయుధ సహాయము, సైనిక సహాయము అందకుండ జేయగలుగుదుము. ఇవి యన్నియు లేక రాజ్యపాలన జరుగునవకాశము లేక పైన కోటలోని వారెంత కాలము మనగలుగుదురు? వారికి లొంగిరాక తప్పదు. ఈ లోగా బహుదూరము ప్రయాణించి వచ్చిన మీరు విశ్రాంతి దీసికొనవచ్చును. తప్పనిసరియై వారు ప్రకటించినను కొద్దిపాటి యుద్ధమే జరుగును. యుద్ధరీతులలో ఇది మంచి విధానము. దీనినే లగ్గలు పట్టించుట యందురు. కనుక మనమిప్పుడీ కొండవీడు గిరి దుర్గముపై నీ యుద్ధరీతిని ప్రయోగింపబోవుచున్నాము. తగిన స్థానములను ఎంపిక చేసుకొని దళపతులందరు తగిన సేనలతో అష్టదిక్కుల మార్గములను మూసివేయుడు. గండుచీమయైనను మన యనుమతి లేక లోనికి పోరాదు. ఇది విధిగా పరిశీలింపవలసిన యంశము. గుర్తుంచుకొనుడు. కొండవీడు కేవలము మన మొదటి మజిలీ మాత్రమే ! మన లక్ష్యము కటకము. ఉత్కళ గజపతి ప్రతాపరుద్రుని కుమారుడే కొండవీటిని బాలించు వీరభద్రపాత్రుడు. కనుక ఈ విజయము గజపతులపై తొలి విజయము కూడ కాగలదు. ఒక దేశమునకు దానిని బాలించు ప్రభువునకు సత్కీర్తి కలుగువలెనన్నచో నది సైనికుల కృషి, పట్టుదల, పరాక్రమము, త్యాగభావములపై నాధారపడి యుండును. సైనికుల విజయమే ప్రభువుల విజయము. ప్రభువుల విజయమే ఆదేశ చరిత్రయగును. మీ బాధ్యత బరువయినది. శ్రీకృష్ణ దేవరాయల

తుళువాన్వయగాధ, విద్యానగర ప్రాభవము మీపై యాధారపడి యుండున ఈ కర్తవ్యమును మీరు వీరోచితముగ పాలింపుడు. మీ రాజభక్తి పరాక్రమమును, శౌర్యప్రతాపములను శాత్రవ చమూసమూహవ విభ్రాంతమై చూడవలయును.

**పద్యము**

**రక్షోవీరులు శూరులెల్లరును సంరంభంబుగా శ్రేణిలో**
**నిక్షేపింపుడు రాయభాస్కరు మహానిక్కృత్తయుద్ధార్థటుల్**
**అక్షీణాగ్రహులై నృసింహుని కరాళాస్యంబు జొప్పించుచున్**
**వీక్షింపన్నరివీరయూథము దెసన్ విభ్రాంతి నొందింపుమా ॥**

దక్షిణాపథమున పాపులను పరిమార్చుటకు శాంతిని స్థాపించుటకు మీ చేయు యుద్ధములు చరిత్రను మార్చగలవు. మీ విజయముల సరిక్రొ చరిత్రను సృష్టించగలవు. ఇక శాత్రవ సేవా సమూహములపై చెలరేగుద సోదరా! గోవిందరాయా! మేనయల్లుడా! నాదెండ్ల గోపన్నా! రాజసోదర అచ్యుతరాయా ! మీరు ముగ్గురును ఈ ముట్టడులలో ప్రధాన పా వహించెదరుగాక! మీ మీ యుద్ధ విశేష శేముషి విభవములు మనసే నివహములన్నియు రెప్పవేయుట మరచి చూచెదరు గాక! జయ విరూపాక్ష దేవా!!

సేనలు: (దిక్కులు పిక్కటిల్లునట్లుగా ప్రతిధ్వనించును.
జై జై విరూపాక్ష దేవా!

తిమ్మరుసు: ఒక్కమారు మన విద్యానగరములోని విఠలాలయస్వామిని కూడ స్మరింపు జై విఠలదేవా !

సేనలు: జై జై పాండురంగా!!

తిమ్మరుసు: ఉభయకావేరుల మధ్య విడిదియున్న మోహనమూర్తిని మనసా విజయకాంక్షులై వేడుకొనుడు.

సైనికులు: జై మోహనరంగా!!

తిమ్మరుసు: శ్రీ మత్తిరుమల పద్మావతీ వేంకటేశ్వరులు మీకు జయము గూర్చుగాక ! ఇక వీరోచితముగా బయనింపుడు.

సైనికులు: (కదం త్రొక్కుతూ పదములు పాడుదురు)

**కొండవీడు మనదేరా**

**కొండపల్లి మనదేరా**

**కాదని ఎవరైనా అన్నారా**

**కటకం దాకా మనదేరా॥ మనదేరా॥**

కొండవీడు గిరి దుర్గమును అన్నివైపులనుండి ముట్టడించి లగ్గలు పట్టించెదరు కాలము గడచి పోవుచుండును. తిమ్మరుసు తీక్షణముగా నాలోచనా నిమగ్నుడయి పచారు చేయుచుండును. తమ్ముడు గోవిందరాయలు, శ్రీకృష్ణదేవరాయల సోదరుడు అచ్యుతరాయలు, తిమ్మరుసు మేనయల్లుడు నాదెండ్ల గోపన్న ప్రవేశించెదరు. వారు ఆయుధములను, కవచమును, శిరస్త్రాణము ధరించి యుందురు. మహాసేనాధ్యక్షుడు, మహామంత్రి అయిన తిమ్మరుసు సమస్యా పరిష్కార విచారము ప్రారంభించును.

తిమ్మరసు : మనము ఈ గిరి దుర్గమునకు లగ్గలు పట్టించి బహుకాల మయినది. కాని పైన కోటలో నున్నవారిలో కదలికలేదన్న సూచనలు కన్పించుచున్నవి. ఇట్లేకాలహరణము జరిగిపోవుచున్న మనకు కల్గు ప్రయోజనమేమి? ఎంత విచారించినను మార్గము కన్పింపలేదు.

గోవిందరా: అన్నగారూ! కొండవీడు నిర్మాణము అద్భుతము. దీనిని జయించుట మాటలుకాదు. పర్వతము ఎత్తయినది. విస్తారమయినది.

నాదెండ్లగోపన్న: మామగారూ! వారికి నాహారముల కొరతలేదు. ఆయుధములకు గొరతలేదు. మంచినీటి కటకటయున్నట్లు దోచదు. జరుగుబాటుబాగున్నది. కనుక నిశ్చింతగానున్నారు.

అచ్యు: రా: వారు కిమ్మనుటలేదు. మనము కూడ ఊరకున్న లాభమేమి?

నా : గో : ఏదియో ఒకటి చేయవలయును.

తిమ్మరుసు: ఏమి చేయవలయునని నీ అభిప్రాయము.

గోవి: రా: మీరే మార్గాంతరమాలోచింపవలయును. గోపన్న కేమి తెలియును. ఆతురపడుచున్నారంతే!

ఆచ్యు: రా: ఈగిరి దుర్గమును లొంగదీయుటకే ఇంతకాలము పట్టినది. ఇంక కటకము వరకు వెళ్ళుటకు ఎంతకాలము పట్టునో? ఈ ప్రశ్న నాకు ఉదయించినది కాదు. సైనికులు చర్చించు కొనుచున్నారు. వేగులవలన వింటిని. వారిలో ఇట్టి ఆలోచనలు కలుగుట, పెరుగుట మంచిదికాదు. త్వరగా పరిష్కారము వెదుకవలెను.

నా: గో: ఆహా! ఈ గిరి దుర్గము మహాద్భుతముగా నున్నది.

గోవి: రా: శత్రుస్థానమును పొగుడుట తగదు గోపన్నా !

నా: గో: దీని నిర్మాణము, ప్రకృతి సహజ వనరులు అద్భుతము. కనుక జయించి తీరవలయుననుచున్నాను. నా సైన్యముతో ముందుగా బురుజులమీదికి విజృంభింతును. అనుమతి ఇందు.

గోవి: రా: గోపరాజు మహోత్సాహములో ఉన్నాడు. కొండవీటిపై కన్ను సోకినట్లున్నది. త్వరపడుచున్నాడు.

నా: గో: ఎట్లయినను దీనిని జయించి తీరవలయును. అది సాధ్యము.

తిమ్మరుసు: మనసున చల్లనిమాట చెప్పితివోయి అల్లుడూ! నీ మాటలు శీఘ్రమే యదార్థములయినచో ఇచ్చట రాజప్రతినిధిగా నిన్నే నియమింపుమని శ్రీకృష్ణరాయలకు చెప్పెదును.

అచ్యు: రా: ముందు జయించు మార్గమను అన్వేషింపుడు.

తిమ్మరుసు: ఆ విషయమాలోచించుటకు నాకు కొంత తడవు ఏకాంతము కావలయును. (అశాంతిగా) మీరు ఇక సెలవు తీసుకొనవచ్చును. (వారు ముగ్గురును అభివాదములు చేసివెళ్ళి పోవుదురు. తిమ్మరుసు తిరిగి ఆలోచనా నిమగ్నుడగును)

తిమ్మరుసు: (తనలో) వీరు త్వరపడుటలో అర్థమున్నది. నిజముగనే పరిస్థితిలో బహుకాలము పురోగమనము లేకున్నచో, సైనికుల యుత్సాహము నీరు కారిపోవును. వీరులయినవారు ఎక్కువ కాలము నిష్క్రియగా కూర్చుండ నాశింపరు. వారి కేదియో యొకపని కావలయును.

యుద్ధమారంభించిన జననష్టమిరువంకల వారికి జరుగుట తథ్యము. కోటలకు లగ్గలు పట్టించినప్పుడు రాకపోకల విషయము బహుజాగరూకత వహింపవలయును.

తగిన జాగ్రత్తలు తీసుకొంటిమి. కాని ఇచ్చట ఏదియో పొరపాటు జరిగినది. రాకపోకలు జరుగకపోయినచో పైన కోటలోని వారికెట్లు ఆహారము అందును? అర్థముకాని చిక్కుముడి ఏదో పడియున్నది. ఎట్లు విడదీయ వలయునో తెలియుటలేదు.

(ఆలోచించుచు ముందునకు నడచును. ఒకచోటున ఆగి చూచును. నేలమీదికి వంగిబాగుగా పరిశీలించును) ఈ చీమ ధాన్యపు గింజను మోసుకొని పోవుచున్నది. దాని వెనుక అనేక చీమలు ఇట్లే మోసికొని పోవుచున్నవి. చిత్రము. ప్రకృతి విధానమెంతయో చిత్రము. ఈ పిపీలికమునకు జీవితాశకలదు. భవిష్యత్తు సుఖప్రదముగా నుండవలయునను వ్యామోహము కలదు. ఈ ధాన్యపు గింజలను అవి తమ నివాసములో దాచుకొనును. భూమిలోపల అరలుండను. వాటిలో ఈ చీమలు ధాన్యాగారమును నిర్మించుకొనును.

వర్షాకాలమున ధాన్యము తెచ్చుకొనుటకు ఒనరు కుదరని కాలములో వాటిని భుజించి జీవించును. పిపీలికమునకు బ్రహ్మకల్పించిన ఏర్పాటు ఇది. జీవులన్నియును ఒక్కటియే! మనుష్యులు కూడ ఈ విధముగనే దాచుకొందరురు. దాచుకొనవలయునన్న ఈ విధిగనే మోసుకొనిపోవలయును కదా! మరి ఈదారిని అడ్డగించినచో ఈ చీమలు ఏమిచేయునో చూచెదనుగాక!

(నాలుగు ఎండుపుల్లలు తెచ్చి చీమల బారునకు నాలుగు వైపుల అమర్చును. చీమలు తమ ఆహారము మోసికొనిపోవు మార్గము నిరోధింప బడినందుకు కలతపడును. ఆ తరువాత చీమలన్నియు గలసి నూకలను క్రింద పెట్టి నోళ్ళతో పుల్లలను కదలించును.ఎండు పుల్లల క్రిందుగా నొకదారి ఏర్పడును. ఆ మార్గమున భారవాహకములయిన పిపీలికములు బారులు తీరిపోవుచుండును. అదిచూచి)

తిమ్మరుసు: వాటి మార్గము నిరోధింపబడినను అవి మరొక రహస్య మార్గమును సృష్టించుకొన్నవి. కృషియన్న నిదే కదా! మానవులకయినను కలిసి కృషి

చేయుటలో సాఫల్యత సిద్ధించును ఇంతియేకదా ప్రకృతి! ఈ యేర్పాటులు మహదాశ్చర్యజనకములు. మరియు జ్ఞానప్రబోధకములు

## పద్యము

**॥ఎంత విచిత్రమీయవని నేవిధినైనను జీవితాశనా**
**సొంతము నిల్ప గల్గుటలు సాధ్యము జీవుల కన్నివేళలన్**
**చింత యొకింతలేక చిరుచీమలు నేర్పుగ దారిజూపె, నా**
**యంతట బోధనేర్చితి? జయంబిక తథ్యము కొండవీటిలో॥**

ఈ పిపీలికములు నేర్పినదే గుణపాఠముగా నెరుగవలయును.
ప్రకృతి జీవులు మేధావులకు పాఠములు బోధించుట చిత్రమగును. ఈ రీతిన నేదో యొకదారిన కొండవీటికి ఆహారధాన్యములందుచునేయున్నవి అవి నిరోధించిన గాని వారి శక్తులు కృంగవు.
తక్షణమీ ఏర్పాట్లు చేయించవలెను!
(తిమ్మరుసు ప్రథమమున తానునిలిచిన సౌధమునకు దిగివచ్చును. ముఖములో చికాకు తొలగి ప్రసన్నముగా నుండును) ఎవరక్కడ? (తలయెత్తిచూచి) సైనికా ఇటురమ్ము
(అతడు పరుగునవచ్చి అభివాదము చేసి ఎదుట నిలచును)
నీవు వేగమె వెళ్లి దళపతులు నా ఎదుటకు రావలసినదిగా తెలియ జేయుము తక్షణము రావలయును

సైనికుడు: చిత్తము మహామంత్రీ!
(పరుగు నడకలతో అచ్చటనుండి వెడలును కొద్దిసేపటి యనంతరము దళపతులు వత్తురు)

తిమ్మరుసు: మనము కొండవీటిని ముట్టడించి ఎంతకాలమయినది?

దళ. ప: బహుకాలమయినది. దేవరా!

తిమ్మరుసు: లగ్గలు పట్టించుటలో ఆంతర్యము మీకు తెలియునా?

దళ: ప: ఆహారము, ఆయుధములు. నీరువెలుపల నుంచి రాకుండ జేయుట. వార్తలు వెలుపలకు బోకుండ జేయుట

తిమ్మరుసు: ఆ పనినిమీరు సరిగా నిర్వహించుచున్నారా?

దళ: ప: నిర్వహించుచున్నాము ప్రభూ!

తిమ్మరుసు: అట్లయిన వారింతకాలమెట్లు నిశ్చింతగా జీవింపగలిగిరి?

దళ. ప: అదే అర్థమగుట లేరు ప్రభూ!

తిమ్మరుసు: మనము రహదారులను మాత్రమే మూసి వేసితిమి ఎన్నిదారుల నుండి చీమలయిన ఆహారపదార్థములను మోసికొని పోవు తెరగు ఒకటి కలదు. దాని గురించి యాలోచించితిరా ఎవరైనా?

దళ: ప: దేవరా! పొరపడితిమి. క్షంతవ్యులము.

తిమ్మరుసు: వివేకముతో విచారింపదగు విషయమును మరచితిమి. కొండవీడు చుట్టునున్న కాలిదారులు, సన్నని బండ్లు పోవుబాటల మీద నిఘావేయింపుడు. ఆ మార్గములందు ధాన్యము గొని పోవు వారందరిని బట్టి తెండు.

దళ: ప: (ఉత్సాహముతో) చిత్తము చిత్తము.

(అందరును వెడలిపోవుదురు. కొంతసేపయిన తరువాత తిరిగి వచ్చెదరు. కొందరు నెత్తిమూటల వారిని బండ్లు నడుపు వారిని వెంటగొని వచ్చెదరు)

తిమ్మరుసు: (గంభీరముగా నవాగతులను ఉద్దేశించి) మీరందరు ఏ ప్రాంతమునకు చెందినవారు?

(అందరు మౌనముగా నుందురు)

శిక్షతప్పించుకొనుటకు నిజము చెప్పుటే మార్గము

(ఎవరును పలుకరు) సైనికులారా .......

వీరిచేతమాటాడింపుడు. (వారి వైపు తిరిగి) చెప్పెదరా?

సైనికులు చెప్పించువరకు మౌనము పాటింతురా?

నవాగతులు: చందవోలు పట్టణము నుండి వచ్చుచున్నాము.

తిమ్మరుసు: ఇట్లెంత కాలమునుండి జరుగుచున్నది?

నవాగతులు: మీరు లగ్గలు పట్టించినప్పటి నుండి!

తిమ్మరుసు: మేము కొండవీడును జయించెదము. కనుక మీరు మా స్వాధినములో ఉండవలయును.ఆ తరువాత స్వేచ్ఛ లభించును. సైనికులారా! వారి దగ్గర ధాన్యమును స్వాధీన పరుచుకుని మనస్కంధావారములోని పాకశాలలకు పంపుడు! ఇంకెన్ని దారులున్నవో అవి అన్నియు తెలిసికొనుడు. తక్షణమే ఆదారులన్నియు మూసివేయుడు! ఎవరైన నిట్లే ధాన్యము తీసుకొని పోవు చున్నచో నటకాయింపుడు.

సైనికులు: చిత్తముదేవరా!! (తెర వ్రాలును)

# ప్రవేశకము

నటుడు: (ప్రవేశించి) నటీమణీ నీకొక ముఖ్య సమాచారము చెప్పవలయునని వచ్చితిని. ఎక్కడను కన్పించవేమి?

నటి: నేనిందుండి ప్రదర్శనా స్వారస్యమును గ్రహించుచున్నాను నటశేఖరా! చతుర్థాంకము పూర్తికాకమునుపే తమరు ప్రవేశించినారేమి?
(ప్రేక్షకుల మధ్య నుండిలేచి వేదిక మీదికి వచ్చును)

నటుడు: నటీమణీ! తిమ్మరుసు మహామంత్రివారు తమ మేధా బలముతో నా విధముగా కొండవీడు గుట్టు కనిపెట్టిరి.

నటి: ఆ తరువాత నేమయినది?

నటుడు: ఏమగును, కోటలోని వారికి ప్రపంచముతో సంబంధములు పూర్తిగా తెగిపోయినవి. చాలాకాలము ఆహారములు అందలేదు. కోటలో ఆకలి చిచ్చురేగినది. సైనికులు విప్లవించిరి. అంతయు అస్తవ్యస్తము కాగా వీరభద్రపాత్రుని అర్ధాంగి శ్రీకృష్ణనామము జపించుచూ ఆత్మహత్యకు పాల్పడినది.

ఆ తరువాత పాత్రుడు లొంగిపోయినాడు. ఇది క్రీ॥శ 23.6.1515న జరిగినది. మాటయిచ్చిన విధంగా తిమ్మరుసు మహామంత్రి తన మేనయల్లుడయిన నాదెండ్ల గోపన్నను అక్కడ రాయలవారి ప్రతినిధిగా నియమించాడు. వారి జైత్రయాత్ర ముందుకు సాగింది. కొండపల్లి రాజమహేంద్రవరం, పొట్నూరు, వడ్డాది, సింహాచలముల మీదుగా సాగినది. ఎక్కడను అపజయమేలేదు.

నటి: ఓహో చాల బాగున్నది. శ్రీకృష్ణరాయల ఘనతయేకదా!

నటుడు: మన కథానాయకుడయిన మహామంత్రి తిమ్మరుసు వారి యుద్ధ వ్యూహముల చాతుర్యమే శ్రీకృష్ణరాయల పరాక్రమమునకు తోడై విజయాలు తెచ్చిపెట్టిందని ప్రజలు చెప్పుకొంటున్నారు. ఇద్దరిని సమానంగా కీర్తించారు.

నటి: ప్రేక్షకుల్లో కూర్చుని చూచుటయే రసవత్తరముగనున్నది.

నటుడు: నీవు అట్లే చేయుము.

(ఇరువురును వెళ్ళిపోవుదురు)

# రెండవ రంగము

(తెరలేచును)

(కటకం. ఉత్కళ ప్రభువులసభామందిరం. ప్రతాపరుద్రగజపతి సింహాసనముపై నుండును. సభ్యులందరి ముఖముద్రలు అశాంతితో నిండియుండును. ప్రభువునకు సాక్షాత్తు బావమరది అయిన అరివీర పాత్రుడు చెవిదగ్గర చేరి పురి ఎక్కించి, కోపమును హెచ్చించుమాటలాడు చుండును)

ఆ. పా: బావగారూ? చూచితిరా ఈ దుండగీడుల సాహసము. శ్రీకృష్ణదేవరాయలట. తిమ్మరుసు మహామంత్రియట! నలుగురు దారిదోపిడీ పిండారీలను చేరదీయగనే అదియొక సైన్యమా? వారొకరాజులా? అయినను దాసీ పుత్రునకు రాజ్యాధికారమెక్కడున్నది? సింహాసనము మీద కూర్చొన గానే ప్రభువులై పోదురా?

దానికి నాభిజాత్యము కావలయును. అది పరంపరగా రావలయును.

ప్రతా: గజ: కర్నాటకము నుండి వారు జయించుచు ఇంతదూరమెట్లు వచ్చిరి?

ఆ. పా: ప్రక్కన మరొక్కడున్నాడు కదా! నయవంచనలకు మేధాసంపద అని పేరు పెట్టుకొని ఊరేగుచున్న మహామంత్రి తి.....మ్మ......రు.....సు, అ.......ట! ఒక మూకను చేరదీసుకుని చిన్న చిన్న పాలెగాండ్ల పొట్టలు కొట్టుచు అవే మా ఘన విజయములని చాటుకొనగానే సరిపోయినదా యేమి?

ప్రతా: గజ: అరివీర మహాపాత్ర! నీ వింతచులకనగా మాటాడుచుంటివేమి? వారుకొండవీడు వంటి మహాదుర్గమును జయించి మా తనయుడు వీరభద్ర మహాపాత్రుని బందీని గావించిరి. ఉదయగిరిలో తిరుమల కాంతరాయ మహాపాత్రుడు మా పినతండ్రిగారిని జయించిరికదా! అంతియేకాక రాజనీతిని ప్రదర్శించి తిరుమల కాంతరాయ పాత్రుని తిరిగి ఉదయగిరిలో సామంత ప్రభువుగా నిలిపితిరికదా!

ఇట్టిరీతులు రాజుకాని వారికి తెలియవు.

అది సరే! వారు కటకమును సమీపించితిరి కదా! యుద్ధ ప్రయత్నములు ప్రారంభించలేదేమి?

అ: పా: (వికవికనవ్వి) ఇటువంటిదే బెలు. పెద్దమ్మలు యుద్ధము అని వచ్చుటయే విచిత్రము. వారిని తరిమి కొట్టుటకొక ప్రయత్నమా? ఈ అరివీరభయంకరమగు ఉత్కళ సేనలకు ఒక లెక్కయగునా! మన పాత్రులు చాలు! వారిని పలాయనము చిత్తగింప జేయుటకు? దానికొక అలోచనమెందుకు?

ప్రతా: గజ: ఎందుకలయినను మంచిది మన సామంత మహాపాత్రులు పదునారు మంది ఉన్నారుకదా! వేగమే రమ్మని వారందరికి వర్తమానము లంపుడు! యుద్ధ విషయములలో అలక్ష్యము, ఉపేక్ష ఎంత మాత్రమును బనికిరావు

**పద్యము**

**॥ రాజులు రాచకార్యముల రంజిలు వేళనుపేక్షసేయగా**
**సాజముకాదు బావ! సమసాధుమనస్కత కల్గియుండి**
**యోజన సేయపాడి యిదియోద్ధలకుత్తమ సాంప్రదాయమౌ**
**వాజియు రౌతుచాలకన వాంఛిత మార్గము పర్వులెత్తెడిన్ ॥**

అ: పా: ఇటువంటి చిన్న చితక విషయాలన్నీ చూచుకునేందుకు నేనున్నాను కద బావగారూ! మీరు విశ్రాంతి మందిరానికి వేంచేయండి.

ప్రతా: గజ: అటులనే (సభ్యులకు నమస్కరించి) జయజయజగన్నాథా !!

# మూడవ రంగము

(సైనికస్కంధావారము పటకుటీరము శ్రీకృష్ణదేవరాయలు తిమ్మరుసు మహామంత్రి ఆశీనులయి వుందురు)

కృ.రాయలు: అప్పాజీ! మనముకటకమును ముట్టడించి బహుదినములయినది కదా! ఆవైపునుండి ఎటువంటి ప్రతిస్పందనలు కన్పించుటలేదు కారణమేమి?

తిమ్మరుసు : మనచారులు వారి మనోభావములు, ప్రయత్నము ఆరాతీయుటకు అహరహము శ్రమించుచునే యున్నారు. కాని సఫలురు కాలేకపోవుచున్నారు. ఉత్కళగజపతుల వ్యవస్థ బహుకాలమునుండి విరాజిల్లుచున్నది. వారికి పటిష్టమగు పాలనాయంత్రాంగమున్నది. దానిని బ్రద్దలు కొట్టుటయనగా మాటలుకాదు.

కృ.రాయలు : ఏది ఏమైనను మనము కర్నాటము విడిచి దిగ్విజయ యాత్రలకు బయలుదేరి బహుకాలమైనది సైనికులు అలసిరి. అశ్వములు సొలసినవి. హస్తిశ్రేణి డస్సినది.

మన సైనికుల మనములు గృహోన్ముఖములయి తొందరించుచున్నట్లు మనము తెలుసుకొంటిమి. ఇది అఖరు మజిలీ! ఈ దండయాత్రతో మన విద్యానగరవైభవము మూడు సముద్రముల మధ్య విస్తారమై పరచుకొనును ఈ యాత్రను త్వరగా ముగింపజేయి శ్రీ రంగధామా!!

తిమ్మరుసు: ఇంతదనుక వచ్చి అలసత్వము నొందుట మంచిదా?

కృ.రాయలు : అలసత్వముకాదు. నాసహోదరి హేమసుందరికి వీరు చేసిన కీడుకు బదులిచ్చితీరకమానను. అంతియే కాక ప్రతాపరుద్ర గజపతి కుమార్తె అన్నపూర్ణాదేవి సౌందర్య చిద్విలాసముల గురించి నేను వినియుంటిని. ఆమెను అర్ధాంగిగా స్వీకరింతును. ఆరాధింతును. గజపతులవలె ఆడువారిని నేను అవమానింపను. ప్రతీకార చర్యగా పడతిని స్వీకరించుట యొక్కటే నాలక్ష్యము.

దానికెట్టి యాటంకము లెదురైనను రొమ్ముులొడ్డిపోరాడుదును.

తిమ్మరసు : ప్రత్యక్ష యుద్ధమునకు వారుదిగరు. లోతుపాతులు, అనుపానులు తెలియకదిగుట మనకు కూడ బాడికాదు.

(కనుబొమలు ముడివేసియాలోచనా పూర్వకముగా) అందుకెదయిన మార్గాంతరమాలోచింప వలయును.

రాజకీయములలో మిత్రభేదమునకు మించిన ఎత్తుగడలేదు.

కృ.రాయలు : అప్పాజీ! ఆయుపాయమేదో శీఘ్రమే కానిండు.

తిమ్మరసు : (సాలోచనగా) సమయముకొరకు వేచిచూచెదము.

కృ.రాయలు : ఇక మీరు విశ్రాంతి గైకొనుడు

తిమ్మరసు : ప్రభూ! ఈకటకము స్వాధీనమయిన తరువాతనే నాకు విశ్రాంతి! చీకటి పడినది. స్కంధావారమునందు రవంతసేపు సంచరించి విషయములు విచారించి వత్తును.

కృ.రాయలు : అటులనే!!

(శ్రీకృష్ణదేవరాయలు విశ్రాంతికి ఉపక్రమించును. అంగరక్షకులు వెంటనంటిరాగా తిమ్మరుసు స్కంధావారమున ప్రవేశించును. అందందు దళపతులను పలకరించి వారినించి వర్తమానములు స్వీకరించి తల పంకించుచు ముందుకు నడచుచుండును.)

అంగ :ర : ప్రభూ! స్కంధావారములు దాటివచ్చితిమి. చాలప్రొద్దుపోయినది.

తిమ్మరుసు : నాయాలోచనముల కభ్యంతరము కల్పింపకుడు!

అంగ : ర : చిత్తము ప్రభూ! (మౌనముగా ఆయనను అనుసరించి నడచుచు ఉందురు. అప్పాజీ చీకటిలో దూరము నడచును. ఒక చోటునకు చేరిన తరువాత దూరము నుండి హయ హేష విన్పించును. అప్పాజీ నేల మీద చెవియానించి జాగ్రత్తగా వినును)

అంగరక్షకులారా! ఒకే అశ్వికుడు అపరిమిత వేగముతో వచ్చుచున్నాడు! ఈ యర్థరాత్రి ఎవరును ప్రయాణము చేయరు. చేసినను అంతవేగముగా వెళ్ళ నగత్యము ఉండదు. మీరాతనిని బంధింపుడు. ఏదో విశేషముండి తీరును. (క్రమముగా హయ హేషలు దగ్గరగును. గుర్రపుడెక్కడల చప్పుడు మరింత విస్పష్టముగా విన్పించును. అపరిమిత వేగముతో దౌడుతీయుచున్న గుర్రము

మీది రౌతును అంగరక్షకులు గుర్తించి గురిపెట్టుదురు. సరియగు సమయములో వృక్షశాఖ మీదినించి దుమికి అతనిని క్రిందికి పడద్రోయుదురు. రౌతును పెడరెక్కలు విరిచి కట్టి అప్పాజీ ముందు నిలుపుదురు)

తిమ్మరసు : ఓయీ! నీవెవ్వడవు?

రౌతు : (సగర్వముగా) గజపతుల మహాసామ్రాజ్యమున చారుడను.

తిమ్మరుసు : అటులనా! ఈవేళపుడింత త్వరగా పయనించుటకు కారణమేమి? నీవు చారుడవా? మా స్కంధవారమున సమాచారమునేమయిన సంగ్రహించితివా?

రౌతు : నేను మీకేమియు తెలియపరుచుటకు సిద్ధముగాలేను.

తిమ్మరుసు : నీవు లేకున్నను మేము చెప్పింపగలము.

రౌతు : ప్రాణత్యాగమయిన జేయుదును గాని నేనేమియు జెప్పను.

తిమ్మరుసు : (తనయంగ రక్షకుల వంక తిరిగి) ఈతని చేత ఆ రహస్యమేదియో చెప్పింపుడు. (ఆతనిని దూరముగా గొనిపోదురు. కొద్దిసేపటి యనంతరము తిరిగ తీసుకొనివత్తురు.)

అంగ : ర : ప్రభూ! ఈతడు చారుడే! వాస్తవము చెప్పుటకు అంగీకరించినాడు. మీరు ప్రశ్నింపుడు.

తిమ్మరుసు : ఆతనిని స్వేచ్ఛగా ఉండనిండు.
(విడిచి పుచ్చెదరు)
నీకు వచ్చిన భయమేమియు లేదు. నిర్భయముగా మాట్లాడుము.
నీకు ప్రాణభిక్ష యిప్పించెదను.

రౌతు : ప్రభూ! ఈ లేఖలు నాచేత పంపించినారు ప్రభువులు. ఇది రాజరహస్యము బయటపడినచో నాతలదీయుదురు.

తిమ్మరుసు : నీకెట్టి భయమురానివ్వను. వాటినిటుదెమ్ము.
(రౌతు వణకుచున్న హస్తములతో నందించును) అంగరక్షకా! కాగడా వెలిగించుము. (మంత్రి ఆదేశానుసారము అతడు కాగడా వెలిగించును. ఆ వెలుగులో మంత్రి ఉత్తరములు పఠించును. ముగించిన తరువాత) ఈతడు మనయదృష్ట దేవత. మూడురోజులపాటు సైనికుల పహారాలో కంటికి రెప్పవలె జూచుకొనుడు. ఆ తరువాత ఘనముగా సత్కరించి, శ్రీకృష్ణరాయల బెండ్లివేడుకలకు తీసుకొనిరండు. (రౌతు వంకచూచి) ఓయీ! నీవు మాకు గొప్ప సహాయము జేసితివి. మిత్రభేదమునకు మంచియవకాశమును జూపించితివి. కార్యసాధనమయిన తరువాత నీకు మంచి బహుమానము

లభించును. అంతదనుక విశ్రాంతి గైకొనుము. (అందరూ కలిసి స్కంధావారమునకు వచ్చుదురు. రౌతును గోవిందరాయలకు అప్పగించి అంగరక్షకులతో గలసి శ్రీకృష్ణదేవరాయలు విడిసిన గుడారము వైపు వచ్చెదరు. వాకిట కావలి వారు మహామంత్రి తిమ్మరుసు వారినడ్డ గింపక లోపలకు పోనిచ్చెదరు.)

**తిమ్మరుసు :** ప్రభూ మన కష్టములు గట్టెక్కినవి. మీకు శుభవార్త.

**కృ.రాయలు:** అప్పాజీ? ఈవేళప్పుడు . మీరు ఇట్లు .. వచ్చితిరేమి? ఏమి ఈ సంతోష కారణము.

**తిమ్మరసు :** మనము మన లక్ష్యమునకు చేరువయితిమి.

**కృ.రాయలు:** ఏమి హఠాత్పరిణామము జరిగినది?

**తిమ్మరుసు :** ఈ లేఖలు మనకు చిక్కినవి.

**కృ.రాయలు :** (లేఖలను శ్రద్ధగా బరిశీలించి) వీని సారాంశము తెలిసినది. మహారాజుయుద్ధ ప్రయత్నము నారంభించినాడు. అతనికి పదునారుగురు పాత్రులు సామంతులుగానున్నారు. వారు అన్ని దిక్కుల నుంచి మనసైన్యముల వైపుగా సుదూరమున మోహరించి ఉన్నారు. ఇది శుభవార్త ఎట్లగును అప్పాజీ! ఈ లేఖల ప్రకారము రేపుసమావేశము జరిగిన తరువాత ఒకటి రెండు రోజులలో అన్ని దిక్కుల నుంచి మహాపాత్రుల సైన్యములు మనసైన్యముల మీద విరుచుకుపడును. ఒకటా? రెండా? పదహారు వంకల యుద్ధము చేసి జయించుట మనసైన్యములకు సాధ్యమగునా?

**తిమ్మరుసు :** ఆ ప్రకారము జరిగినచో చరిత్ర మరొక విధముగా మారును. ఈ లేఖలు ముందుగా మనకు దొరుకుటయే మీ అభ్యుదయ కారకము కాగలదు.

**కృ.రాయలు:** అదెట్లు సంభవము కాగలదు ?

**తిమ్మరుసు:** ముందు మీ రాజముద్రను నాకు ఇండు

**కృ.రాయలు:** (రవంత అయినను సంశయింపక) అందుకు అభ్యంతరమేమున్నది? అప్పాజీ! ఈ శ్రీకృష్ణదేవరాయలే మీవాడు. రాజముద్రికయనగా నెంత ?
(వెంటనే తీసి అతనికి అందించును)

**తిమ్మరుసు:** సైనికా నీవు వెళ్ళి ఒక లేఖకుని తీసుకొనిరమ్ము. వలదు. వలదు. ఉత్తరములు

నేనే స్వయముగా వ్రాయుదును గోవిందరాయలను బిలిపింపుము. (రత్నకాంతులు చిమ్ముదీపము దగ్గర కూర్చుని ఉత్తరములు వ్రాయుట ప్రారంభించును. వాటి మీద రాజముద్రికలు అద్ది భద్రముగా మడచును గోవిందరాయలు ప్రవేశము మహామంత్రి ఆజ్ఞల కొరకు ఎదురుచూచుచుండును.) గోవిందరాయా! పదహారు కావడి పెట్టెల నిండ బంగారు ఆభరణములు తెప్పింపుము. కర్నాటము నుండి కటకము వచ్చువరకు మనము కప్పములుగా తీసుకున్న సంపదలన్నియు దెప్పింపుము.

గోవి.రా: అవి లేకున్నచో మన సైన్యమునకు ఇక ...

కృ.రాయలు: ప్రభువులయాజ్ఞ!

(వెళ్ళిపోవును. కొద్దిసేపటికే కావడిపెట్టెలు వచ్చును)

తిమ్మరుసు: ప్రభూ! మీరు మాతో రండు. ఇద్దరు వెలుపలకు వచ్చెదరు. అపారమయిన సంపదలతో నిండిన కావడి పెట్టెలను పరిశీలించి తృప్తిపడి ఒక్కొక్క పెట్టెలో నొక్కొక్క ఉత్తరము ఉంచును.) సైనికులారా! ఈ పెట్టెలను మోసుకు వెళ్ళుడు. ఎవరయినను అనుమానించి అడిగినచో మహాపాత్రులకు చేర్చమని మా మహామంత్రుల వారు చెప్పిరి అని తప్పమరేమియు మాటాడరాదు. తెలిసినదికదా!

సైనికులు: అటులనే ప్రభూ! (కావడి పెట్టి ఒక్కొక్క దానిని రెండువైపుల ఎనిమిదిమంది చొప్పున అన్నియు మోసుకొని వెళ్ళిపోవుదురు). తిరిగి శ్రీ కృష్ణదేవరాయలు అప్పాజీ పటకుటీరములోనికి వచ్చెదరు. మహామంత్రి ఒక యాసనముపై కూర్చుండి దీర్ఘముగా నిట్టూర్చును)

తిమ్మరుసు: మనకు విరూపాక్ష స్వామి అనుగ్రహము కలిగినది శ్రీకృష్ణరాయా! నీ అభ్యుదయము తథ్యము.

కృ.రాయలు: అప్పాజీ! నా సర్వం సహా రాజ్యము పోయినను బాధపడను. మీరు ప్రశాంతిగా రవంతసేపు విశ్రాంతిగైకొనుడు! (పరిచారకులను పిలిచి వీవెనలు వీయ నియమించును. అప్పాజీ విశ్రాంతిగా కన్నులు మూయును. తిరిగి అతడు కన్నులు తెరుచువేళకు ఎదుట వేగులవారు ఉత్సాహముగా కన్పించుదురు).

తిమ్మరుసు: మిత్రభేదము ఫలించినదా? లేకున్న మనమిక యుద్ధము చేయజాలము తిరిగిపోవలసియుండును.

కృ.రాయలు: అప్పాజీ! (రెండు చేతులు పట్టుకొని) మీరు ధన్యజీవులు. మీయాదరమునకు నోచుకున్నందులకు నేను ధన్యజీవిని. మీరు ప్రయోగించిన మిత్రభేదము ఫలించినది. మన వేగులు వర్తమానము దెచ్చినారు.

తిమ్మరుసు : ఏమయినదో త్వరగా వివరింపుడు.

వేగు : ప్రభూ! కావడి పెట్టెలు మోసుకొని సైనికులు వెళ్ళిరి. వారిని గజపతి వేగులవారు పట్టుకుని ప్రభువుల ముందు నిలిపిరి. అతడు కావడి పెట్టెలలోని మహాసంపదలు చూచి ముందు ఆశ్చర్యపడిరి. ఆ తరువాత అందున్న ఉత్తరములు చూచి చదివిరి. పాత్రులు పదహారుమందికి రాయలవారికి సంధి కుదిరినట్లు దానిలో ఉన్నదట! ఆ సంధి ప్రకారము పాత్రులకు రాయలవారు కానుకలు పంపుట, యుద్ధ సమావేశమున పాత్రులతో చర్చలకు వచ్చిన ప్రతాపరుద్రుని పదహారుమంది పాత్రులు పట్టి యిచ్చుట షరతులట! అది చదివి ప్రతాపరుద్ర గజపతి గడగడ వణకినాడు. అతని బలమునకు మూలస్థంభములు పాత్రులే కదా! వారు స్వతంత్రులయి ఉత్కళ రాజ్యమును పంచుకొన వలయునను కోరికతో తనను పట్టి యిత్తురని భీతిల్లినాడు. అతివేగముగా రాచనగరుకు తిరుగు ప్రయాణమై వెళ్ళినాడు. ఆ తరువాత ఏమి జరుగునో తెలియదు.

కృ.రాయలు: (ఆతృతగా) అప్పాజీ ఇప్పుడేమి జరుగును.

తిమ్మరుసు : నీయదృష్టము పండినది. అంతా శుభమే జరుగును. (మరికొందరు వేగుల వారు పరుగున వత్తురు)

తిమ్మరుసు : మీరు తెచ్చిన వర్తమానములేవో వినిపింపుడు.

వేగులు : ప్రభూ! ప్రాణభయముతో గజపతి కోట విడిచి పారిపోయినాడట!

తిమ్మరుసు : శ్రీకృష్ణరాయా! అదృష్టవంతుల కెందును దిరుగులేదు.

మరికొందరు (హడావిడిగా ప్రవేశించి) పాత్రులకు వర్తమానములు అందినవి.

వేగులు గజపతి నగరము విడిచి పారిపోయెనని వార్త పొక్కినది. పాత్రులు నగరమును కోటను స్వాధీనపరచుకొనుటకు బయలుదేరినారు.

తిమ్మరుసు : (నవ్వి) "సకల శుభములిచ్చు దైవంబు సజ్జనులకు" మనమింక దడవు సేయరాదు. సేనలను గదలింపుము. వారికి ముందుగా నీవు ఏనుగుపై

అంబారి కట్టించి ఎక్కి రావలయును. ఉత్కళ రాజధాని కటకము సింహాసనముపై నీవు అధివసించు సుముహూర్తము ఆసన్నమయినది. ఆడంబరముగా బయలుదేరుము పాత్రులకన్న ముందుగా మనము కోటలోనికి ప్రవేశింపవలయును. కటకము సింహాసనమిక రాయర్లదే!!

కృ.రాయలు : (సంతోషాతిరేకముతో తిమ్మరుసును కౌగలించుకొనును) మీ మేధా సంపదయే రాయర్ల విజయకారణము అప్పాజీ!

తిమ్మరుసు : కుమారా! ప్రశంసలు తరువాత. ముందు కర్తవ్యమును ఆలోచింపుము. ఒక్కుమ్మడిగా సైన్యమంతయు మహాట్టహాసముతో నగర ప్రవేశము చేయవలెను. పాత్రులకు వార్తలందించువారు అదిరిపడివారిని నగరములోనికి రావలదని వార్తలు పంపవలెను. రాజకీయములలో నొక్కొక్కసారి ఉన్నదానిని లేనట్లు, లేనిదానిని ఉన్నట్లు ప్రదర్శింపదగును. మన వాస్తవ బలమునకు మించిన యాడంబరము ప్రదర్శితము కావలయును. బయలుదేరుడు. శ్రీ కృష్ణరాయా శుభస్య శీఘ్రం.

కృ.రాయలు : మీ వచనములు శిరోధార్యములు. (వెనువెంటనే దండనాయకులు ఆడంబరముగా సైన్యములను నదలింతురు. సర్వసేనాపతిగా తిమ్మరుసు మహామంత్రి గుర్రము మీద బయలుదేరును. శ్రీకృష్ణదేవరాయలు దేవేంద్ర వైభవముతో వారి మధ్య ఏనుగు అంబారీపై అనుసరించును. అట్టహాసముగా విజయోత్సవముతో భేరి భాంకృతులతో శ్రీరాయల వారి సైన్యము నగర ప్రవేశము చేయును. రాజు పారిపోయిన కారణముగా గజపతి దళములు అన్నియు కకావికలగును. అంతఃపురము చుట్టును మహామంత్రి తన సైన్యములను కావుంచును. వారు కోటను, సింహాసనమును ఆక్రమించుకొందురు. తిమ్మరుసు శ్రీకృష్ణరాయలను చేయిపట్టినడిపించి ఉత్కళసింహాసనముపై అధివసింపజేయును. సైనికులు విజయమహోత్సాహముతో కరతాళధ్వనులను జేయుదురు. దిక్కులు పిక్కటిల్లును. (తెరవాలును).

# ప్రవేశకము

నటుడు : (వచ్చి) నటీమణీ! నీవు ప్రేక్షకుల యందే కూర్చుండి చతుర్థాంకములోని కళ్యాణ ఘట్టమును కూడచూడుము. ఒక్క విషయము చెప్పి ముగించి నేను కూడ వత్తును. సింహాసనము రాయల వశమయిన తరువాత పాత్రులు ఎత్తిన పడగలు దింపిరి. శ్రీ కృష్ణరాయల వారి ప్రతాపము, మహామంత్రి తిమ్మరుసు వారి మేధాసంపదల ముందు తాము నిలువలేమని గ్రహించారు. బాగా విచారించి ప్రతాపరుద్ర గజపతి జాడ తెలుసుకొన్నారు. ఈలోగా తిమ్మరుసు వారికి రాయబారం పంపారు. రాయలు కయ్యము చేసినది నెయ్యము కోరి మాత్రమే కాదు. వియ్యమునకు కూడ. అన్నపూర్ణాదేవినిచ్చి కళ్యాణము జరిపించిన చాలు. ఎవరి సింహాసనములు వారికే అప్పగించగలరు. కర్నాటకము పొదలచినట్లు రాయలవారి అభిప్రాయంగా తెలియపరిచారు. ఈ వార్తలు విన్న పాత్రులు మాత్రమే కాదు, ప్రతాపరుద్రు గజపతి కూడ సంతోషించాడు. అంతటి మహామహునితో వియ్యము. వెంటనే వారంతా బయలుదేరి వచ్చారు. అన్నపూర్ణ లేక తుక్కాదేవియు శ్రీ కృష్ణ దేవరాయల వారికిని కళ్యాణము, ఉత్కళ సామ్రాజ్య రాజధాని కటకములో కన్యాదానము జరుగును. ఈ విషయం ప్రపంచమంతా చాటించారు. కళ్యాణ ముహూర్తం ఆసన్నమయింది. వేద ఘోషలు వినిపిస్తున్నాయి కదా! వింటున్నావా నటీ! ఇక పెళ్ళి సందడి అంతా స్త్రీలదే!! మరింక అడ్డు నేనెందుకు. శ్రీ కృష్ణరాయలు అన్నపూర్ణాదేవుల కళ్యాణము చూతము రారండీ!! (పాడుకొనుచు వెళ్ళును)

(తెర లేచును)

(కళ్యాణ వేదిక శ్రీకృష్ణదేవరాయలు అన్నపూర్ణాదేవిని పాణిగ్రహముచేయును. ముత్యాల తలంబ్రాలు పోసికొందురు. తిమ్మరుసు మహామంత్రి, ప్రతాపరుద్ర గజపతి అక్షతలు చల్లుదురు. మిగిలిన మహాసభ అక్షతల వర్షం కురిపించును. సర్వసైనికులకు అధికారులకు కవి పండితులకు బహుమతులనిచ్చెదరు.)

# పంచమాంకము

## మొదటి రంగము

తిమ్మరుసు : నాయనా! శ్రీకృష్ణా! మనము కర్నాటకము పోవలయును. విద్యా నగరము నీ రాకకై వేన వేల కన్నులతో ఎదురుచూచున్నది.

కృ.రాయలు : అవశ్యము అప్పాజీ! సేనావాహినుల తరలించుడు.

ప్రతా.గ.జ : అప్పాజీ అమాత్యా! మీ ప్రజ్ఞాధురీణత అమోఘము. రెండు మహాశక్తులు ఢీకొన్న సమయమున భయంకర రక్తపాతము జరిగియుండెడిది. దానిని తప్పించిన వారు మీరు. మీ మేధస్సుకు శతధా సహస్రధా వందనములు.

తిమ్మరుసు : కత్తులు దూయుట, కదనములు సేయుట రాజులకు క్రొత్తకాదు. కాని అది కేవలము దుష్టశక్తులను అణచుటకే అని గ్రహింపవలయును. సృష్టి సంఘర్షణాయుతమే! కాని రక్తపాతము అవాంఛనీయము! గజపతులు ఓడి గొప్ప అల్లుని సంపాదించుకున్నారు. రాయర్లు గెలిచి సుగుణవతిని దక్కించుకున్నారు. మధ్య నాదేమున్నది? నిమిత్తమాత్రుడనే!

కృ.రాయలు : అన్నింటికి అప్పాజీయే నిమిత్తము, అందరును మాత్రులే!

ప్ర.గజ : (నవ్వి)మా పాత్రులకే పదబంధములు క్రొత్తగా నున్నవి!! (అందరును సంతోషహాసములు చేయుదురు) తెరవ్రాలును.

# రెండవ రంగము

(తెర లేచును)

(విద్యానగరము. ముత్యాలశాల. సింహాసనము మీద శ్రీకృష్ణ దేవరాయలవారు ఆశీనులయి వుందురు. మహామంత్రి తిమ్మరుసు వారి ప్రక్కన ఉచితాసనముపై కూర్చుని ఉందురు. సభమహోత్సాహముతో నుండును. మహావిజేత అయిన రాయలవారిని వారి కుడిభుజమై నిలచి మంత్రాంగ విదుడై విజయములు సాధించి పెట్టిన తిమ్మరుసు మహామంత్రిని అందరూ ఆరాధనా భావముతో తిలకించు చుందురు)

తిమ్మరుసు : (లేచి) మన విద్యానగర వైభవము, రాయర్ల బలపరాక్రమాలు ప్రపంచ మందెల్లెడల జగజ్జేగీయమానమై వెలుగొందినవి. ఇది విద్యానగర ప్రజలయిన మనందరకి గర్వకారణము. పట్టణమంతా పసుపు కుంకుమలు పూసి పచ్చాకులు కట్టి పండుగలు చేసుకొనుచున్నారు. ఈ శుభతరుణమున విజయకారకులయిన వారందరికి సముచిత సత్కారములు చేయుటకే రాయలవారు ఈ సమావేశము నేర్పాటు చేయించిరి. ఈ సందర్భమున నేను ఒక మాట చెప్పెదను. యుద్ధములు అవాంఛనీయములు. కాని దురాశా పరులను, దుర్జనులను అదుపు చేయుట అవసరము. రాజ్యమున మనమిప్పుడు నిశ్చింతగాయున్నాము. అఖండమయిన శాంతిని ప్రజలు అనుభవించుచున్నారు. దీనికంతటికి సాధన ముఖ్యము. శ్రీ కృష్ణదేవరాయని చరిత్ర ఇంతటితో నాగరాదు. అది మరింత ఉజ్వలమై, మహోజ్జ్వలమై సాగవలయును. వారి చరిత్ర అమరలేఖినులతో లిఖింపబడవలెను. ఇది నా యాకాంక్ష! వారి తండ్రి తుళువ నరసరాయలవారు నాతో ఆజన్మాంత మైత్రిని చేసిరి. వారికిచ్చిన వాగ్దానమును నేనిప్పుడు నిలుపు కొన్నవాడనైతిని. (ఉత్తరీయముతో చెమరించిన కన్నులు అద్దుకొనును) ఇక నిప్పుడు కవితా వైభవములతో సభ ప్రారంభమగును.

అ. పెద్దన : మహారాజాధిరాజ! రాజ పరమేశ! మూరురాయర<br>గండ ! సమర రంగ ప్రచండ మార్తాండ! కామినీ<br>కందర్ప సుందర ! రాజ దేవేంద్రా ! నరేంద్రా !!

సీ.స: ॥ తొలుదొల్తను దయాద్రిశిలదాకి, తీండ్రించు
నసిలోహమున వెచ్చనయి జనించె,
॥ మరికొండవీడెక్కి మూర్కొని, నలియైన
యలకసవా పాత్రునంటి, రాజె,
॥ నటపాణి జమ్మిలోయబడి, వేగిరహించె,
గోనబిట్టేర్చె, గొట్టాన దగిలె,
॥ గనకగిరిస్ఫూర్తి గరచె, గౌతమిగ్రాచె,
నవులనాపొట్నూర రవులు కొనియె,
॥ మాడెములు వ్రేల్చివడ్డాది మసియొనర్చె,
గటకపురి గాల్చె, గజరాజ గలగిపరచె,
దోకచిచ్చన నౌక ? యుద్ధురత గృష్ణ
రాయబాహుప్రతాప జాగ్రన్మహాగ్ని !!

కృ.రాయలు : కవీశ్వరా ! మీ కవిత్వమునకు బహుకృతుల స్వీకరింపుడు
(శ్రీ కృష్ణ రాయలు స్వయముగా బహుకృతులు ఇచ్చును. అవి స్వీకరించి యల్లసాని పెద్దన తన యాసనముపై గూర్చుండును)

నందితిమ్మన :

పద్యము

చంపకమాల: ముసుకొని కొండవీటి కదమూధలరుద్రుడు కృష్ణనందనుని
మనసిజునిందహించె, నరమానుషమే? నరసేంద్రు కృష్ణరా
యన్నృపతి కొండవీటి కడనాజిజితుండు - ప్రతాపరుద్రనం
దనుడగు వీరభద్రు గరుణామతిగాచె, జగత్ప్రసిద్ధంబుగన్॥

కృ.రాయలు: కవితావైభవము కడు రమ్యము స్వీకరింపుము
(బహుకృతులిచ్చగా నందిమనని వెళ్ళి కూర్చుండును.)
విజయములు నేము సాధించితిమని కవిశేఖరులు మాపై కవితలు చెప్పినారు. కాని ఈ విజయము సాధించినవారెవరో ఈ విజయ కారకులెవరో

వారిపైనను గూడ నొక పద్యము జెప్పెదను. వీరే కృష్ణదేవరాయల విజయములకు మూల కారణము. రాజభక్తి, ప్రజానురక్తి ఉభయక్షేమమే వారి యాదర్శము. వారి ఋణము తీరునదికాదు. తరతరాలు తరగక వెన్నంటి వచ్చు పెన్నిధి వారి ప్రేమ !!

ఆ యనురాగమును జవిచూడగలుగుట నా యదృష్టము. వారు లభించుట ఆంధ్రుల యదృష్టము

వారు మానవతకే మణి మకుటము

ఇంత చెప్పిన దనుక వారెవరో మీకు తెలిసియే యుండును. ఇది నా కవిత్వము కాదు. విశ్రుతము.

**పద్యము**

**అయ్యయనిపించు కొనగ**

**నెయ్యంబున గృష్ణరాయ నృపపుంగవుచే**

**అయ్యా! సరియెవరయ్యా!**

**తియ్యని విలుకాడవయ్యా! తిమ్మరుసయ్యా!!**

కనుల నుండి ఆనంద బాష్పములు రాల్చును.

ఇరువురును కౌగలించుకొందురు.

సభ్యులు హర్షధ్వానములు చేయుదురు.

## భరత వాక్యం

శా.ది : **॥ శ్రీరంగంబున రెండు పాయల గుటల్ శ్రీదేవి భూదేవిగా**

**సారంగాంక విలోచనాసుదతి కాసారాద్భుతాపూరకా**

**దే! రంగన్న పదార్చనావిధికి నాదేవేరి కావేరియై**

**ఆరంగాఖ్యుడు మిమ్ముగాచు భువిశోభార్థంబు సంధిల్లగన్ ॥**

